·roved for School use.

కాసరత్నమాల. 6.

# అమరవిజయము

( కొ హి నూ రు. )

(చరిత్రాత్మకమగునవల)


రెండవకూర్పు

శంకర నారాయణకవులచే

సంపాదింపఁబడినది.



[వెల రు 0—14—0.

# ప్రస్తావన.

ఇది కన్నడభాషలో సుప్రసిద్ధాఖ్యాయికా రచయిత లగు బి. వేంకటాచారిగారి "కొహినూరు" అనునవల కాంధ్రీకరణము.

కథానాయకుఁడగు నమరసింహుఁడు శత్రువులను జయించుట, ప్రతిజ్ఞను నిర్వహించుకొనుట, కామితార్థమును బడయుట మొదలగు విజయాభ్యుదయములతోఁ గథసమాప్త మగుటచే దీనికి "అమరవిజయము" అని నామకరణము చేసితిమి.

ఈయమరవిజయము రత్నమాలికలోని యాఱవరత్న మగు కొహినూరు. ప్రపంచమునఁగలసుప్రసిద్ధరత్నములలో నగ్రగణ్యము నమూల్యమునైనదికొహినూరే. ఇది పూర్వము భారతవీరుఁడును మహారాజచంద్రుఁడు నగుభూరిశ్రవసుని కరకంకణము నలంకరించినది. పిదప ననేకభారతసామ్రాజ్య పట్టాభిషిక్తులశిరోమకుటముల నధివసించినది. కాలక్రమమున మొగలాయి చక్రవర్తులఁజేరిన యీయమూల్యరత్నరాజము ఔరంగజీబుచక్రవర్తియొద్దనుండివచ్చి యేతత్కథానాయకుఁడును, రాజపుత్రవీరయువకుఁడు నగునమరసింహునిసువర్ణమకుటావతంసమయ్యెను. గోపాలవీరుఁడు స్యమంతకమణితోఁ గన్యామణిని గ్రహించినట్లయినది. ఇందలికథ వీరశృంగార రసములతో విలసిల్లుచున్నది.

ప్రకాశకులు.

(కృతి.)

నాదైవరత్నమునకు

ఈనవీన కృతిరత్నమును

అర్పించుకొంటిని.



# అమరవిజయము.



## ఉపక్రమణిక.

నేఁడు రాజస్థానమునందు * "అహేరియా" యను మహోత్సవము; జనకోలాహలపూర్ణమైన రాజనగరము జనశూన్యమై యుండెను. రాజవీథులయందుఁ దిరుగాడువా రెవ్వరును లేరు. గృహములలో జనులసందడి లేదు. నేఁ డాబాలగోపాలముఁ గొండలయందును, గుహలయందును, శైలశిఖరములందును మృగయాఖేలనమున నడవిలోఁ దిరుగాడుచుండిరి. సూర్యభగవానుఁ డస్తమించుచుండెను. పశుయుద్ధరంగమునుండి యెవ్వరు నింకను దిరిగి రాలేదు. ఇతరదినములలో సాయంకాలమునకుఁ బూర్వమే "రాజసముద్ర" తటాకతీరమునం దనేకులు వాయుసేవనమునకై తిరుగాడుచుందురు. నేఁ డొక్కఁడేయును గానిపించుట లేదు. చెఱువుప్రక్కనున్న విష్ణుమందిరద్వారమునందు, మంచుచేఁ దడుపఁబడినవస్త్రమువలె పరివృతమై, చిలమంటలవలెను వ్రేలాడుచున్న కేశకలాప భర్తృవిహీనయగునయువతియొక తె మాత్రము చేతిపత్రిపుష్పములను మందిరవేదికపై నునిచి, తలవం

* వీరపురుషు లెల్లరు సంవత్సరమున కొకసారి వేఁటకై యడవికిఁబోవు మహోత్సవము జరు.

చికొని చేతులు ముకుళించుకొని నిమీలితనయనయై కాతరవ
చనములతో భగవంతుని తనయభీష్టమును గూర్చి ప్రార్థించు
చుండెను. ఆమెయున్నచోటికి కించుకదూరమున శుక్లపక్షదశ
మీచంద్రరేఖవలెఁ బదియేఁడులయీడుగల బాలికయొక్క పైపూ
గుత్తులభారముచేఁ గ్రిందికివంగియున్న కింశుకవృక్షముక్రింద
నిలుచుండి తలయెత్తి పైకిఁ జూచుచుండెను.

ఈసమయమునఁ బండ్రెండేండ్ల బాలుఁడొకఁడువచ్చి
చెఱువుగట్టున నీటికి సమీపమున నిల్వఁబడి యుండెను. అతని
శరీర మంతయు రక్తమయమైయుండెను. మొలలో నొఱలోని
కత్తి వ్రేలాడుచుండెను. అతని రెండుచేతులయందును రెండు
పక్షు లుండెను. ఆబాలుఁడు తనమేనిరక్తమును గడుగుకొను
టకై సోపానపుమెట్లయందు నిల్వఁబడియెను. కాని చేతియం
దున్న పక్షుల నెవ్వరికీయవలయును? చెయి విడిచినచోఁ బక్షు
లు పాఱిపోవును. కింశుకవృక్షముక్రింద నిలువఁబడియున్న బాలి
కను జూచి యామెను సమీపించి "నీ వెవ్వరు? ఒంటరిగా ని
చుండి యేమిచూచుచుంటివి?" అని యడిగెను.

బాలిక చెట్టుకొమ్మవైపునకుఁ జెయి చా
జూడుము! ఆపువ్వెంతయందముగా నెంతపెద్దదిగా
చూడుము" అనియెను.

బాలు—నీ కాపువ్వు కావలయునా?

బాలి—అది నాకెట్లందును? అది మె

నున్న ది.

బాలు—(నవ్వి) ఎత్తైనకొమ్మపై నున్నపు వ్వువ్వును గోయలేరా ? నీవు నా రెండుపక్షులను బట్టుకొని యుండుము. ఇప్పుడే నీ కాపువ్వును దెచ్చి యిచ్చెదను.

బాలిక సంతోషముతోఁ బక్షులను బట్టుకొని చెట్టువైపు చూచుచు "నీయొడలికి ముండ్లుగుచ్చుకొననేమో" అని యెను.

బాలు—ముండ్లకు భయపడి రాజపుత్త్రికకు పువ్వును దెచ్చుటకు వెనుదీయునా ? ఇదిగో ! చూడుము ! వేటకై నే నడవికిఁ బోయియుంటిని; కాని నేను బాలుఁడ నని చెప్పి యందఱును నన్ను దిగవిడిచి ముందుగా వెడలిపోయిరి. రాజపుత్త్రి సేనాపతియగు విక్రమసింహుఁడొక యడవిపంది నెదుర్కొనియెను. ఆయుద్ధమునందు సేనాపతియే యోడిపోవున ట్లగపడియెను. పంది తనకోఱపండ్లచే సేనాపతిపొట్ట చీల్పనుంకించెను. వెంటనే నేను పోయి కత్తిని జేతఁబట్టుకొని సేనాపతి కడ్డముగా నిలిచియుంటిని. ఇదిగో చూడుము ! నాగుండెలపైఁ బందికోఱలు గ్రుచ్చుకొని రక్తము ప్రవహించుచున్నది. కాని నేను భయపడి వెనుకంజ వేసితినా ? మఱియుఁ బక్షులను బట్టుకొనుట కడవిలో దూఱినప్పుడు దేహమంతట నెన్నియో ముండ్లు గ్రుచ్చుకొన్నవి చూడుము:—నీకొకపువ్వ దెచ్చి యిచ్చుటకు వెనుదీయునా ?

బాలిక పూవు దొరకునని పరమానందభరితులయ్యెను. కాని తనకొఱకుఁ బువ్వును దెచ్చుటకు వెడలిన బాలుని శరీరమునకు ముండ్లు గ్రుచ్చుకొని గాయములగునేమో యని వ్యాకులితచిత్తముతోడను గద్గదసుకుమారస్వరముతోడను "నీయొడలికి ముండ్లు గ్రుచ్చుకొని నొప్పిగల్గినచో నన్నుఁ గోపపడవుగద" అనిపలికెను.

బాలుఁడు బాలికముఖసౌందర్యమువలెనే మాటలును మధురములైనవని యనుకొనియెను. అప్పుడప్పుడే సూర్యుఁడస్తమించుచుండెను. అస్తమించుచున్న సూర్యుని యరుణకాంతులు "రాజసముద్రి" చంచలతరంగములపైఁ బడి ప్రతిబింబించుచు బాలికబాలేందువదనమును మఱింతయుజ్జ్వలముగాఁ బ్రకాశింపఁజేసెను. ఫాల్గునమాసమునందలి మధుర మోహనమైన యామినీకాంతియుఁ, గొంచెముకొంచెముగా నస్పష్టముగా మసకవాఱుచున్న ఛాయయుఁ బ్రకృతివక్షమునఁ బ్రవేశించుచుండెను. పాలపిట్ట జగదాహ్లాదకరుఁడైన చంద్రుని ప్రేయసియగు రజనీకాంత నుచ్చకంఠమున సప్తమతానముతోఁ బలుకరించుచుండెను. రాజసముద్రితరంగమాలికలు చంద్రకాంతశిలాసోపానములఁ దడుపుచుఁ బ్రేమపులకితములై మెఱయుచుండెను. మృదుపుష్పసౌరభ మాతరంగముల నాలింగనము చేసికొని, యాతపసంతాపచంచలమైన తన దేహమును జల్లఁబఱచుకొని యామినిని దోడి తెచ్చుటకు బయలుదేఱి పోవుచుండెను. శుక్లపక్షయామి

నీకామిని ధరించిననీలవర్ణపుచీర చెఱఁగునందలి యొకటిరెండువ జ్రపుచుక్కలు దూరాకాశప్రదేశమునఁ గానిపించుచుండెను. చంద్రుఁడు నీలాకాశస్థమునుండి యాశతోడను నిరాశతోడను, భయముతోడను ధైర్యముతోడను దొంగితొంగి చూచుచుండెను.

బాలుఁడు నలువైపులం జూచి భీతహరిణేక్షణయైనయా బాలికచంచలనేత్రములఁజూచుచు "నీకొఱకుఁ బువ్వుఁదెచ్చునప్పుడు చెట్లముండ్లన్నియు 'నాశరీరమంతటఁ గుచ్చుకొని గాయములైనను సరియే; నీపై నేను గోపింపఁజాలను" అనియెను. అప్డుఁడు కంటకమయమై యున్నగుట్టపై నెక్కుచుండెను. ఆసమయమందు బాలికచేతిలోనిపక్షి యొకటి యెగిరిపోయెను. బాలుఁడు చెట్టుపైకెక్కి పూవును గోసికొని క్రిందికి వచ్చి "ఏది ! నాశారిక యెట్లు పాఱిపోయినది ?" అని యడిగెను.

బాలి—నేను వదలివేయవలెనని వదలివేసితినా ?

బాలు—అయిననో నెట్లుపాఱిపోయినది ?

బాలి—పువ్వు గోయుచున్న నిన్నుఁ జూచుచుఁ బరధ్యానమున నుండఁగా—అయ్యో ! ఈపిట్టగూడ నెగిరిపోయినది !

ఇంతలో బాలికచేతిలోని రెండవపిట్టయు నెగిరిపోయెను. బాలుఁడు కోపించుకొనలేదు. సిగ్గుచేతను, గలఁతచే

తెను నెఱ్ఱవాఱిన మోముతోనున్న బాలికను జూచి యాబాలుఁడు "నీపూవిదిగో! పుచ్చుకొనుము——నే నిప్పుడే పోయి పక్షుల మరలఁబట్టుకొనివచ్చెదను. నీవు కొంచెముసే పిక్కడనే యుండుము." అని చెప్పి గుట్టపైకెక్కి పరుగెత్తుకొని పోయెను.

విష్ణుమందిర మహాద్వారమున నింతవఱకుఁ బూజసేయుచున్న యావితంతుయువతి తనపూజాకార్యమును ముగించుకొని బాలిక నిలిచియున్నచోటికి వచ్చి యామెను ముద్దిడుకొని "అమ్మా! పోవుదము రమ్ము. ప్రొద్దుపోయినది, రాణావచ్చువేళ యైనది" అని చెప్పుచు నాబిడ్డ నెత్తుకొని వెడలెను. అల్లాసు కొంతదూర మేఁగి "అమ్మా! ఇదియేమి మ్మాటిమాటికిని గొండగుట్టలవంకకే తిరిగిచూచుచున్నావు?" అనియెను

బాలిక కన్నులు బాష్పపూరితము లయ్యెను. ఆమె "అమ్మా! ఆబాలుఁ డింకను దిరిగిరాలేదేమే?" అని తల్లితో ననియెను.



శ్రీరాములు

# అమరవిజయము.

## ప్రథమభాగము.

### మొదటిప్రకరణము

ఒక్కానొకప్పుడు సార్వభౌముఁడైన "అక్బరు" మంత్రు
లతో మాటాడుచుఁ దనసింహాసనమును చేతితోఁ జూపుచు
గంభీరస్వరముతోఁ దీవ్రముగా "మొగలుచక్రవర్తి యీయ
ఖండసామ్రాజ్యమును బరిపాలించుటలో హిందువులకును
ముసల్మానులకును భేదమెప్పుడుచూపించుచున్నాఁడో యప్పుడే
యీరత్నసింహాసనము [illegible]
కొనుఁడు" అని యన[illegible]

రాజకులగురు[illegible]
సంపూర్ణసామగ్ర్యము[illegible]
ములు మనసునం ద[illegible]
గతియే కలుగును. [illegible]
పరుఁడును, నిషు[illegible]

నము నధిరోహించెను. ఔరంగజేబువంటి స్వమతాభిమానమును బరమతఖండనమును బరమసిద్ధాంతముగా నున్నవారును, స్వమతోన్మత్తులగువారిమాటల ననుసరించి కార్యముల నొనరించువారును, హృదయమునందలి విషమును దియ్యనిమాటలచేఁ గప్పి పుచ్చువారును నగు శాసనకర్తలను వెదకుటకై దేశాంతరములకే పోవనక్కఱలేదు. అట్టివారి నించుమించుగాఁ బ్రతిరాష్ట్రమునందును జూడనచ్చును. రక్తసముద్రమున నీఁది యీఁది, దురాకాంక్షయనెడి ఘోరశలాకాఘాతములచే భారతనివాసులహృదయములను జీల్చి సహోదరులరక్తముచేసెను, దాద్రి కన్నీటిచేసెను, అగ్బరునిపవిత్రప్రపౌత్రాత్మకుఁ దష్టణమిచ్చిన యౌరంగజేబు దానవదర్పముతోడను, పిశాచగౌరవముతోడను భారతసింహాసనముపైఁ గూరుచుండెను. ఆతనికిఁ దోడుగాఁ బైనుదాహరించిన సర్వగుణసంపన్నులగు శాసనకర్తలును, సైన్యాధిపతులును సామంతులయి యక్కడక్కడ నెలకొని

...యొక్కయు, నాతని
...చేఁ బీడితమై హిందు
...యట్టహాసధ్వనులతో
...కన్నముగానిముసల్మా
...నను గాంచి యూర్ష్య
...యెను. ఇరువదికోట్ల
...పస్పర్శాశంకవలనను

నిరుత్తరులై జీవచ్ఛవములై పోయిరి. యమునాతటమునందు వేదపాఠఘోషము నిలిచిపోయెను. జాహ్నవీతరంగములయందు శంఖఘంటికారవంబులు సద్దణంగిపోయెను. దేవమందిరముల యందు మంగళారాత్రికములు మాయమై పోయెను. శాస్త్ర నిపుణులు, నధ్యయనవ్రతశీలురు నగుపండితులు, వేదపురాణ ములను, సాంఖ్యపాతంజల్యాదిదర్శనములను, గీతాద్యుపనిషత్తు లను, మనుయాజ్ఞవల్క్యపరాశరాది స్మృతులను, మాఘుకాళి దాసాది మహాకవులకావ్యములను, భూమియందుం బాతి యుంచిరి. ఏలన ? సంస్కృతగ్రంథములను జూచినచో యవనులు కాల్చి వేయుచుండుటచేత; అత్యంతశ్రీమాయమా ములును, అశేషప్రయత్నరక్షితములును, అసంఖ్యజనసమా దృతంబులును, అనంతప్రేమ ప్రాకితములు నగు దేవమూర్తు లన్నియుం నిభృతగృహములయం దొంపుబాకులచేం గప్పివైవం బడి యుండెను. ఏమన—పాదుషహా యాజ్ఞాప్రకారము హిందూదేవమూర్తులచే ముసల్మానులమసీదులకు సోపాన ములు నిర్మింపంబడుచుండెను. సీతాద్రౌపదులవలెను, సావిత్రీ దమయంతులవలెను సర్వగుణసంపన్నలై మర్త్యలోకమున దేవతారమణులవలెం బవిత్రమూర్తులై వెలయుచున్న యార్య నారీమణులు, శాత్రవభయముచే నంతఃపురములయం దణంగి యుండిరి. ఇంద్రియపరితృప్తికొఱకే లలనామణులము సృష్టింపం బడె ననుముఖ్యోద్దేశము గలయవనులు తమ యుద్దేశమును

వ్యాపింపఁజేయుటకోయన దుర్వృత్తులై పశుప్రాయులై వ్యవహరింపఁజొచ్చిరి, పవిత్రమలరత్నములఁ బ్రసవించుచున్న భారతభూమి భయదారణ్యముగాఁ బరిణమింపఁ జొచ్చెను. కృషికులు కృషికార్యములకు నిర్భయులై పోఁజాలకుండిరి. వారు తమ గోబృందముల నేకాంతముగా రాత్రివేళ నడవులకుఁ దోలి, యింటిగుమ్మములకుగడియలు వేసికొని, నేలపైఁ బడి పొరలుచు నేడ్చుచుండిరి. ఏలన ? గోమాంసమును దినకున్న యవనుని జఠరాగ్ని చల్లారుట లేదు,

ఔరంగజేబు దురాశచేఁగలిగిన దుర్దమనీయ మోహాంధుడగు వసుధైకపరిపాలుబడిచే నిస్సత్త్వమై శవప్రాయమై యున్న యార్యావర్తమునుండి హిందూనామము నామరహితమై పోవునని తలంచెను. కాని, ప్రకృతి సంహారమూర్తిని ధరించుటకుముందు శాంతమూర్తిని ధరించియుండునని, పాపకార్య పరంపరచే విజేతుఁడైన యవనసార్వభౌముఁడు దెలిసికొనఁజాలఁడయ్యెను. జీవచ్ఛవములై యసంఖ్యాకులైయున్న యార్యజనులు స్వల్పకాలములోనే యాకస్మికముగాఁ జేతనలాభమును బొంది ప్రచండచండమారుతముచే సంక్షుభితములగు సముద్రతరంగములవలె ఘోరగర్జన మొనరించుచు లేచుచున్నారనివిని సార్వభౌముఁడు సంస్తంభితుఁడయ్యెను. ఆరావళి పర్వతోపత్యకలయందుఁ బ్రవహించుచున్న "లూనానది" తీరమున నొఁటలు వెతికినలక్షోపలక్షలకత్తులతో నిరువదిమంది

రాజసింహుల కిరీటవజ్రప్రభలు ప్రతిఫలించు చుండుటఁ జూచి యూరంగజేబు చకితుఁడయ్యెను. అత్యల్పకాలమునందే యూరంగజేబు దీపశిఖచే సముద్రమును శోషింపఁజేయుటయు, నోటిగాలిచే నాదిత్యతేజము నార్పివేయుటయు నసాధ్యకార్యములని తెలిసికొనియెను.

సంధ్యాకాలమున కించుకముందుగా నజమీరునగరమునకు సమీపమునందున్న హారదేవపురగ్రామమున నొకటి రెండుమైళ్ళదూరమునందుఁ బ్రవహించుచున్న కాళిందీనదీతీరమున నిర్జనమగు పెద్దబయలునందుఁ బశువులను మేపు కృషిక బాలుఁడొకఁడు ఏకాంతముగాఁ బరుండి యోచించుచుండెను. ఎనిమిదవత్సరములకుఁబూర్వము చిన్నతనమున రాజసముద్రసరోవరతీరమునందుఁ గింశుకవృక్షముక్రింద నొక బాలిక యెక్కడనుండియో వచ్చి యాతని నొక్కసారి-ఒక్కసారి మాత్రమే ముఖమును జూపి యెక్కడకో పోయి దాఁగికొనియెను. అదిమొదలాకృషికబాలుఁడెక్కడెక్కడ నెల్ల వెదకెను, ఆదివ్యమూర్తి—హారజటాజూటవిహారిణి యగు వాసుధాంశురేఖ—జగత్తునం దెక్కడను గానఁబడలేదు. పశుపాలకుఁడగు నా బాలకుఁ డెక్కడకుఁబోయి యేమిచేసిన నామె నింకొకసారి చూడఁగలనని యోచించుచుండెను.

యోచించుచుండఁగనే యువకునకు నిద్దురవచ్చెను. నిద్రావస్థయందే స్వప్నమును గాంచెను. స్వప్నమునం

దాయపార్థివనిధిస్వరూపమైన—ఆసౌందర్యవినిందితదేవతాస్త్రీబృందమైన—ఆబాలికను వెదకుచు జీవసంచారములేని యున్నతపర్వతములపై కేఁగినట్లును, పర్వతశిఖరములపై నున్న సమభూమియందుఁ బెద్దపెద్దతరంగములతో నొకనదిగర్జించుచుఁ బ్రవహించుచున్నట్లును. యువకుఁ డాపర్వతశిఖరముపై నిలిచి "ఆహా! మరల నొకసారి చూడఁజాలనా?" యని యఱచినట్లును, ఎవ్వరో పైనుండి భయము లేదు; మఱలఁ జూచెదవని ప్రత్యుత్తర మిచ్చినట్లును దోఁచి, బాలుఁడు చకితుఁడై చూడఁగాఁ, దల వెండ్రుకలను విరియఁబోసికొని లావణ్యమయియగు స్త్రీరత్న మొకతె యూతని యెదుటకి వచ్చి నిలిచి "మఱలఁజూచెదవు" అని చెప్పినట్లును, యువకుఁడు కాతరుఁడై, "ఎప్పుడు చూతును? ఎక్కడఁజూతును? ఎన్నినాళ్లలోఁ జూతును?" అని యడుగఁగా నాస్త్రీరత్నము నీయెదుటకే కన్నుల విచ్చి చూడుమని చెప్పినట్లును, బాలుఁడాతురముతో గన్నులు విచ్చి చూడఁగా నెదుట నగణితసౌధమాలికలచే శోభితమై యున్న యొకవిశాలరాజధానియు—దానినడుమ విశాలసభామండపమున నసంఖ్యదానవదళములు చెవులను జెవుడుపఱచు భయంకరాట్టహాసములచే గగనమును జిల్లులువడఁజేయుచున్నట్లును, ఆయట్టహాసములతో నలుదెసలనుండి పఱతెంచుచున్న యసంఖ్యజనులహాహాకారశబ్దములు చేరుచున్నట్లును, రాజధానికి నలుదెసల నెత్తుటియేఱులచే రక్తనదీప్రవాహము వేగ

ముగాఁ బ్రవహించుచున్నట్లును, ఆరక్తతరంగములయందు శతసహస్రనరనారీశరీరములును, ఖండఖండములైన బ్రాహ్మణదేహములును, క్షత్రియవీరుల క్షతభుజములును, సగము వేగినకుస్తుకలుగల కమనీయకామినీమణుల వదనములును, మునిఁగి తేలుచుఁ బోవుచున్నట్లును; మఱియు నాదానవసభకుఁబైభాగమున నంబరతలమున నంతరిక్షమున లెక్కలేని దేవతలు నిమీలితనయనులై, చేతులుజోడించుకొని నిలుచున్నట్లును; కందిపోయిన మోములుగల యానేలుపుల మూసినకన్నులను భేదించుకొనుచు నజస్రాశ్రుజలములు వర్షాకాలవారిధారల వలె జాతిరక్తనదీతరంగములతోఁ జేరిపోవుచున్నట్లును; ఆవ మణిమూర్తి చెప్పినట్లు యువకుఁడు తలమఱియునుపైకెత్తి చూడఁగా నీలగగనమునందు సుందరమణిగణఖచితమైన సువర్ణనిర్మితపర్వతఖండ మొకటి కనఁబడినట్లును, పర్వతపాదమూలమునందు శ్వేతసలిల కనకకమలములచే శోభితమగు నాకాశగంగ మృదుమధురశబ్దముతోఁ బ్రవహించుచున్నట్లును; పర్వతవక్షోభాగమునఁ బ్రఫుల్లపారిజాతపుష్పదళములపై జ్యోతిర్మయమగు నతివిచిత్రసింహాసనమును—ఆసింహాసనము చంద్రకిరణములచేతను పుష్పసౌరభముచేతను నిర్మితమైనట్లును, సింహాసనమును జుట్టుకొని యసంఖ్యరమణీమణులులలితస్తుతిగానములచేనమరనగరమును బ్రతిధ్వనింపఁజేయుచున్నట్లును, మఱియు—ఇదేమి? కృషికయువకుఁడు పులకితప్రాణుఁడై,

నిష్పందనయనుండై, విస్మితహృదయుండై, రోమాంచితదేహుం
డై చూచుచుండఁగా నారత్నగిరిపై నాకనకకమలమాలికాను
యమందాకినీతీరమున నాసుధాంశురశ్మిచే నిర్మితమైన సింహా
సనమున కెదురుగా ననంఖ్యసురనారీజనమధ్యమున, ననంఖ్య
తారాగణమధ్యమునఁ బూర్ణశశివలెఁ గాంతివిశిష్టయగు నప్ర
తిమధుర బాలికామూర్తిని గాంచినట్లును "ఈమెయే యామె"
యని తెలిసికొనినట్లును. ఆహరజటాజూటమునఁ బ్రకాశించు
చున్న చంద్రరేఖ పూర్ణగౌరవముతోను, బూర్ణసౌందర్యము
తోను, బూర్ణచంద్రరూపమున నాబాలికయై పరిణమించిన
ట్లును, మొట్టమొదటఁ బ్రత్యక్షమైన రమణీమణి ముగ్ధ
హృదయుండైన యువకునిలలాటమునుస్పృశించుచు "నీవక్కడ
కుఁ బోవుట కిచ్ఛగించుచుంటివి గదా? కాని యతి సాహస
మును ననేక సాధనములును గావలయును. భీషణమూర్తియు
భీమపరాక్రమశాలియు నైనదానవదళమును సమ్ముఖయుద్ధ
మున గెలిచి నిమీలితనయనులగు వేల్పులప్రసాదనమునుబొంది
యారక్తనదిని దాఁటినచో నక్కడకుఁబోఁగలవు; నీకదిసా
ధ్యమగునా?" అనియడిగినట్లును, యువకుఁడు "దేవీ! ఆశీర్వదిం
పుము. అవశ్యముగా నట్లేచేయఁగలను" అని చెప్పినట్లును, ఆదే
వి యత్యుచ్ఛకంఠముతో నతిమధురమును దీవ్రము నగు స్వ
రముతో నాకాశము, భూమియుఁ, బర్వతశృంగమును బ్రకం
పించునట్లు "అట్లయిన లెమ్ము. ఇఁకఁ బరుండవలదు" అని
కేకలిడినట్లును. "లెమ్ము, లెమ్ము." అను నాశబ్దము

దైత్యరాజధానియందుఁ బిసుగువడినట్టి దేవతల దేహముల రో మాంచితములు గావించి, రత్నగిరియందుఁ బ్రతిధ్వనించి, దశదిశలయందును "లెమ్ము లెమ్ము. ఇకఁ బరుండవలదు" అనిమాటలు మ్రోగుచున్నట్లును గాంచెను.

యువకునకు నిద్రాభంగమయ్యెను, సుఖస్వప్నము పరిపూర్ణమయ్యెను. ఆతఁడు కన్నులు నులిమికొనుచు నలుదెసలఁ జూచెను. ఒకప్రక్కఁ గాళిందీనది ప్రవహించుచుండెను. తక్కినప్రక్కల నిస్తబ్ధము జనశూన్యము నగుబయలు. ఆపర్వతశృంగ మెక్కడ? ఆదానవరాజధాని యెక్కడ? ఆ దేవతలేరి? ఆమందాకినీనది యేదీ? సైకతవాసినియై, దేవకాంతామధ్యవర్తినియై, పూర్ణశశికళాస్వరూపిణియై, గౌరవమయియై, శాంతిమయియైయొప్పునామూర్తి యేమాయెను?-మఱియేమాయెను? యువకుఁడు వెనుదిరిగి చూచెను. కలలోఁ గాంచిన—తలవెండ్రుకలువిరియఁబోసికొనియున్న లావణ్యమయి యమునాదేవి మూర్తి నిలిచియుండెను, ఇదియేమి స్వప్నమా? యువకుఁడు తాను మేల్కనియుండెనో నిద్రించుచుండెనో తెలిసికొనుటకై మఱల నలుదెసలఁ బరికించి చూచెను. ఆకాశమునందు నక్షత్రము లలరారుచుండెను, శశాంకుఁడు నవ్వుచుండెను. క్రింద నీలవసనధారిణియుఁ జంచలపాణియునగుతరంగిణి నక్షత్రమాలికాహారమును ధరించుకొని నృత్యము సేయుచుండెను. అయినచో నిది స్వప్నము గాదు. సత్యమే. రమణి తారస్వరముతో

"లెమ్ము లెమ్ము, మరల నిద్రింపవలదు" అనియెను. మఘురిమున దీవ్రిముచు, మనోమోహనకరము నగుచదేశాంతస్వరము యువ కుండు లేచి చకితనయనములతోఁ జంచలహృదయముతో ర మణిని దృష్టించి చూచుచుండెను. ఆరమణియు "నీయొద్దఁగత్తి యున్నదా?" అని యడిగెను. నిద్రనుండి లేచినయువకుఁడు విస్మితుఁడయ్యెను. అతఁడు మాటాడలేకపోయెను. రమణియుఁ బ్రత్యుత్తరముకొఱకుఁ గొంచుక సేపుమాత్రిము రూరకుండి మరల "నీయొద్దఁగత్తి యున్నదా? హృదయమునందు సాహస మున్నదా? బాహువులలో బల మున్నదా? నరములలో నార్యరక్త మున్నదా? హృత్పిండమున స్వర్గమునకంటె మేలైనజన్మభూ మిపై మమత యున్నదా? ప్రత్యుత్తరమిమ్ము" అనియెను.

యువ—ఉన్నది.

రమణి—అయినచో నా వెంట రమ్ము.

పశువులను గాయుయువకుఁడు మంత్రిముగ్ధునివలె నా రమణివెంట బయలుదేరెను. రమణియుఁ జంచలపదవిక్షేపము తోఁ గొంచెముదూరమేఁగి యొకపురాతనభగ్నమందిరమున కెదురుగా నిలుచుండి యువకునిఁ గాంచి నీవిక్కడ నించుక సే పు నిలిచి యుండుము. వెంటనే వచ్చెదను" అని చెప్పియామం దిరములోనికిఁబోయెను, యువకుఁడెంతసేపు నిరీక్షింపలేదు. ఇంచుక సేపటిలోనే రమణి యొకముసలిమానుషఫకీరుని వెంట ని డికొని యావలికి వచ్చెను. యువకుఁడు చూడఁగా ఫకీరున

ఒక్క కౌపీనమాత్రవసనుఁ డుండెను. కుడిచేతియందలి భీషణకృపాణము చంద్రకిరణములలో మెఱసిపోవుచుండెను. శుభ్రశ్మశ్రుశోభితమును జ్యోతిర్మయమును నగునాతని ముఖమండలమును, విభూతిచర్చితమును జడలచే సర్ధావృతమునునైన బలిష్ఠదేహమునుజూచి యువకునిశరీరము రోమాంచితమయ్యెను. ఆతని కాంతెరికి భక్తిప్రసముదయించెను. యువకుఁ డట్టి తేజోమయయోగిమూర్తి నెక్కడను నెప్పుడును జూచియుండలేదు. ఫకీరు ప్రేమపూరితనయనములతో యువకునిఁజూచి పిమ్మట రమణినిసంబోధించి” “వత్సా! నీవిక్కడనే వేచి యుండుము; నేనీ వీరయువకునియువనయుద్ధమునకు వెంటఁబెట్టుకొని పోయెదను” అనిఫకీరు వేగముగ ముందు నడవసాగెను. యువకుఁ డాతనివెన్నంటి పోయెను.

—◆—

## రెండవ ప్రకరణము.

—)○(—

“ఊరకుండు మూరకుండుము! పరుండుము; ఏడువవలదు. ఔరంగజేబుపాదుసావారిఅఫ్జుల్ ఖాను వచ్చుచున్నాఁడు” అని హరదేవపురమున రాత్రులయందుఁ దల్లులు పిల్లలను భయపెట్టి నిద్రపుచ్చుచుండిరి. అఫ్జుల్ ఖాన, బాదుషహాకుఁ బ్రియతముఁ డగు సేనాపతి. కాఫిరమతము (హిందూ) దేశమున లోపింపఁజేయుటకు అఫ్జుల్ ఖాననేకప్రయత్నము

లు చేయుచుండెను. హిందువులపై "జిజియాపన్ను"(తలపన్ను) వసూలు చేయుటయే కాతఁడనేకాన్యాయములు తనసేవకులచే రా క్రియమును జూపుచుండెను. ఒకనాఁడు హరదేవపురగ్రామమును దోచెను, చుట్టుపట్టులగ్రామములవారును జిజియాపన్ను చె ల్లించుటకు సమ్మతింపరైరి. అఫ్జుల్ ఖాను బహుసంఖ్యాకమైన సైన్యమును బిలిచి పన్నీయనిద్రోహులై యున్నపురుషు లచేతులను, ఆఁడువారిచెవులను, బిడ్డలవ్రేళ్లను గోయుటకా జ్ఞాపించి కాఫరులను గోరక్తముచే స్నానముచేయించి "ఖురా న్"(ముసల్మానుల వేదమంత్రము) జదివింపవలె నని యనేకా న్యాయములు కట్టడి చేసెను. అదిమొదలు హరదేవపురవాసు లైనయాబాలవృద్ధులు అఫ్జుల్ పేరు చెప్పగానే భయపడు చుండిరి. విశేషించిబిడ్డలు వాఁడనిన భూతమని యేమొ విశ్వాసము గల్గియుండిరి. ఆకారణముననే అఫ్జుల్ పేరు చెప్పి తల్లి బిడ్డల ను భయపెట్టుచుండుట వాడుకయైనది. శిశువు అఫ్జుల్ పేరువి నినంతనే యేడ్పు మాని తల్లికంఠముఁ గౌఁగిలించుకొని కన్ను లు మూసికొనెను.

ఆకస్మికముగాఁ దల్లికంఠమును గౌఁగిలించుకొనియున్న యొకబిడ్డ బెదరి చేతులపట్టు విడి క్రిందఁబడియెను. తల్లి కలవ రపడి నేలపైఁ గూలఁబడియెను. అది గాంచి బిడ్డ మఱింతభయ పడి యేడువఁదొడఁగెను. నిజముగా నఫ్జుల్ ఖానే! ఆకస్మిక ముగా గ్రామమునందు గగ్గోలు పుట్టె పురజనులందఱును భ

యముతో "మరల నజ్బుల్ వచ్చినాఁడు" అని కేకలు వేయుచుండిరి. పయూప నొక్కొక్కానైన మిగులకుండఁ జెల్లించివేసిరి. కాని మరల నజ్బుల్ఖా నెందుకు వచ్చినాఁడు? ఈగోల యెందులకు? ముసల్మానులు గొప్పదండును దెచ్చి గృహద్వారములు బద్దలు కొట్టి యింటింటఁ బ్రవేశించి కొల్లగొట్ట నారంభించిరి. పశువులను విప్పి పైకిఁ దోలివేసి యువతులజుట్టు పట్టుకొని బలవంతముగా నీవలి కీడ్వ నారంభించిరి. గ్రామస్థులు సహించుచుఁ జేతులు జోడించుకొని "పాదుషావారిపై నొట్టు; మే మెట్టితప్పును జేసియుండలేదు. మాజోలికి రావలదు" అని వేఁడుకొనఁ జొచ్చిరి. కాని వినువా రెవరు! అఫ్జలు గుఱ్ఱముపైఁ గూర్చుండి "జాగ్రత్త; ఒకకాఫరైనను దప్పించుకొని పాఱిపోకుండఁ జూడుఁడు. ఒక స్త్రీయైన నొక్క గోవైనఁ జెదరిపోఁగూడదు. వృద్ధాంగనలను చిన్నిబిడ్డలను విడిచివేయనచ్చును" అని యాజ్ఞాపించుచుండెను.

నిరాశ్రయులై నిరపరాధులై యున్న గ్రామస్థులకుఁ దమబలపరాక్రమములు చూపుట కవకాశము లేకపోయెను. ఆయుధములు దీసికొనుట కవసరము లేకపోయెను. ముసల్మానుసైనికులు యువకులను, వృద్ధులను, యువతులను, గోవులను బాధించి సమీపమునందలి శిబిరములకుఁ దీసికొనిపోవుచుండిరి. నిర్జనమైయున్న యాబయలునందు ముసల్మానులయొక్క అట్టహాసములు చెలరేఁగుచుండెను. ఏగోవును ముందుగాఁ జావవలయును? ఏయువతి నెవరు గైకొనవలయును? అఫ్జుల్ ముందుగా వచ్చి

తాను స్వయముగా దేని నేరుకొనునో?" అని సైనికులుచెప్పిం చుకొనుచుండిరి. ఈగోలలో "పీరుభక్షు" అను సైనికుఁడు రహిమానునిఁ జూచి "రహిమాన్! మనము వెచ్చినవారిలో నిద్దఱుకాఫరులు పగ్గములను ద్రెంచుకొని పాఱిపోవుచున్నట్లు న్నది?" అనియెను.

రహి—చూచుచుము, వీరు గారు, వారితరగ్రామవాసు లైయుందురు.

పీరు—ఇతరగ్రామవాసు లైన నేమి? వారునుకాఫరులే.

వాస్తవముగా హిందువులిద్దఱుసమీపమునందున్న కాళిందీ నదీతీరమున సంధ్యావందన మొనరించుకొని మహాదేవునిస్తుతిం చుచు నామార్గమున వచ్చుచుండిరి. పీరుభక్షునిమాట ముగి యకుండఁగనే వారును సమీపమునకు వచ్చిరి. వారిలో నొ కఁడు "ఇచ్చట నీగోల యేమి?" అని యడిగెను.

పీరు—నీవొకవిచారణకర్తవా? కాఫర్! బద్మాష్! మిమ్మిద్దఱను గూడఁ బట్టుకొని తీసికొనిపోవుదుము. వీరితోఁ గూడఁ దీసికొనిపోవుదుము.

బాటసారి—వీరి నెక్కడకుఁ దీసికొనిపోవుచున్నారు?

పీరు—నబాబుశిబిరమునకు-చూడుఁడు! మిమ్ముసుఁ గూడఁబట్టి యచటికే తీసికొనిపోయెదము.

బాట-—అంతతొందర యెందులకు? మేము పాఱి

పోవువారము గాము. మే మడుగఁగూడదా? మీరు చెప్పఁ గూడదా? ఇందఱుపురుషులను, స్త్రీలను, బసవులను దీసికొని పోయి యేమిచేయుదురు?

పీరు—ఓరికాఫరా! నీకు జ్ఞానములేదా? ఈపశువు లన్నిటిని గోసి "కబాబ్"చేయుదుము.మఱియు నీరక్తముతో హిందువులను స్నానమాడింతుము.

ఈమాటలు వినినంతనే బాటసారులకన్ను లెఱ్ఱవడి పోయెను. చీకటిగా నుండుటచే ముసల్మానుల కది కనఁబడక యింకను నేమే మో చెప్పఁదొడఁగిరి.

పీరు—పిమ్మట వీరినందఱ నొక్కొక్కరుగా శూల ములఁ గుచ్చి, యీయువతులను మేము పెండ్లిచేసికొం దుము. ఈపీరుభక్తు,ముఖమును మూసికొని యున్నయీబీబీని స్వయముగా—

పీరుభక్తుమాట ముగియకుండఁగనే బాటసారులలో నొకఁడు పీరుభక్తుగుండెలపై బలముగా నొకపిడిగుద్దు గుద్దెను. పీరుభక్తు దూరముగా నిశ్చేష్టుఁడై పడిపోయెను. ఇంత లో రెండవబాటసారి వేగముగఁ బోయి బందీలైయున్నవారి బంధనముల విప్పివేసెను. పీరుభక్తు క్రిందఁబడినచప్పుడు విని యక్కడనున్న ముసల్మాను లందఱును వచ్చి బాటసారుల నిద్దఱ నాక్రమించిరి. దూరమునందున్న అఫ్జుల్ "ఆబా టసారుల కాలుచేతుల విఱిచికట్టి తేసికొనిరండ"ని యాజ్ఞాపిం

చెను. కాని వారిని గట్టువా రెవరు? ఆబాటసారు లిద్దరు నప్పు డెదుటనున్న మామిడిచెట్టుపెద్దకొమ్మలను విఱిచి పట్టుకొని రుద్రమూర్తులను ధరించి "భం,భం,శంభో! త్రిపుర సంహారీ! జయజయ దైత్యవిదారీ! ఉరగహారీ! త్రిశూలధారీ! భవభయహారీ! మృత్యుంజయ! భం,భం, శంభో!" అని రుద్ర నామముల స్మరించుచు రుద్రబలముతో శాఖాప్రహరణము లచే యవనసేనను నేలఁ బడఁగొట్ట నారంభించిరి. బాటసారు లచే విడుదలఁబొందినబందీజనులు కోలాహలముఁ గావించుచు రుద్రనామము లుచ్చరించుచు శత్రువులను విడువక నేలఁబెట్టి కొట్టుఁడని కోలాహలము సేయుచు దొమ్మియుద్ధము సేయఁజొచ్చిరి. దూరమందున్న "అఫ్జుల్" చెదరిపోవుచున్న సైనికులను సంబోధించి "ఓయవనవీరులారా! చేత నాయుధము లుండఁగనే చేయిచేసికొనినచోఁ గాఫరులందఱును వెంటనే యమాలయమునకుఁ జేరుదురుసుఁడీ!" అని గర్జించి భీకరముగాఁ బలికెను.

ఆమాటలను విని తోడనే సైనికగణము కత్తులు, సీటెలు మొదలగునాయుధములతో నీనినవులులవలె వచ్చి బాటసారులపైఁ బడ నారంభించిరి. కాని యావీరు లిద్దఱు నించుకైన వెనుకంజ వేయలేదు. నిర్భీకహృదయములతో నస్త్ర వర్షముపైఁ బిడుగులుపడినట్లు శాఖాప్రహారములఁగావించుచు "భం,భం,శంభో! రుద్రా! శంకరా!" అనియఱచుచు శత్రునా

శన మొనరించుచుండిరి. బంధవిముక్తులైనవారుగూడ నారు ద్రిమంతోచ్చారణముచే నాకస్మికముగా నపరిమితపరాక్రమమును బొంది చెట్లుకొమ్మలను విఱిచికొనివచ్చి యున్మత్తులవలె సాహసులై యవనసైన్యమును వధించుచు "భం, భం, శంభో. రుద్రా! శంకరా!" అను బలప్రదాయకమగు రుద్రనామమునుచ్చరించుచుండిరి. బందీలైయున్న స్త్రీలు మాతృమూర్తులవలె వెనుకనుండి చేతులతో జప్పటులు చఱచుచు "భం భం, శంభో, శంకర, రుద్రా, దేవ! త్రిపురారీ!" అని బిగ్గఱగా బాడం జొచ్చిరి.

కాని, శత్రుల యెదుటం జెట్లుకొమ్మ లెంతసే పాగగలవు? శస్త్రపాణులగు యోధులతో నిరస్త్రులగువీరు లెంతసేపు పోరాడంగలరు? దానవదళవిదళన మొనరించురుద్రనామమున నమృతసంజీవినీసుధాధార ప్రవహించుచున్నదిగాంబోలును! రణకోలాహలము నతిక్రమించి, శత్రుల ఝణఝణత్కారముల నాహతులైనయోధుల యార్తనాదములను, ఉభయపక్షముల యందలి వీరులహుంకారశబ్దములను, నణగించి "హర, హర, భం భం, శంభో" శబ్దముమిన్నంటిపోవుచుండెను. ఆవిచిత్రరణరంగ భూమియందు "భం, భం, శంకర, రుద్ర, దేవ, హర, శంభో, త్రిపురారీ" అను మధురధ్వాన మొకటమాత్రమే శతశతకంఠముల నుండిబయలుదేఱి సప్తమతాలమున వినంబడుచుండెను. రణప్రాంగణమునం దొకపార్శ్వమునం దొకకంఠస్వరము వినవచ్చెను. రంగభూమికి నతిదూరమునందలి "భం, భం, హర

శంభో—" యనుశబ్దము, ఈకోలాహలములతోఁ జేరి దానిని మఱింత హెచ్చు గావించెను. ఆకస్మికముగా నరుణమూర్తి యగు తరుణకృషికయువకుఁడు ప్రళయమేఘమువలె గర్జించుచు, దీర్ఘకృపాణపాణియై రణరంగమునఁ బ్రవేశించెను. మఱియు నిదియేమి? ఆసమయమునందే సంభ్రమశోభి తుండును, శ్వేతజటాజూటధారియు, నాజానుబాహుండును, గాషాయధారియు నగుముసల్మానుఫకీరొకఁడు భయంకరముగఁ గర్తి ద్రిప్పుకొనుచు ఘనాఘనగంభీరగర్జనంబున "భం, భం, శంభో" శబ్దముతో "నల్లా హెూ"నాదమును జేర్చి కేకలిడుచు హిందువులపార్శ్వమునందు నిలిచి వృక్షశాఖాముసలముల హిందూవీరుల నాలింగనము చేసికొని, యవనసంహారముఁ గావింప హిందూపక్షమునఁ జేర్చుకొనియెను.

## మూఁడవప్రకరణము.

"ముసల్మానుఁ డెప్పుడైనను గాఫరులతోఁ జేరి ముసల్మానులతోఁ గత్తిగట్టుట సంభవించునా? హిందువులతోఁ జేరినయీముసల్మానుఫకీరు భూతమైయుండఁడుగదా?"

"భూతమనుటకు సందేహమేమున్నది? కాని హిందూభూతము ఫకీరువేషము వేసికొనుట యెందులకో! హిందువు లిట్లు మూఁడునాల్గుభూతములను వశముచేసికొన్న ముసల్మానులదుర్దశ కంతముండునా?"

"అది యట్లుంచుము. ఈపాటికి భూతము లన్నియు వెడలిపోవునని కొనియెదను.అక్కడ నవాబుగారి నేమైనదో పోయి చూచియైనను వత్తుమురమ్ము. ఆవైపునకుఁ జూడుము!"

యుద్ధమునఁబ్రాణములు దక్కించుకొని పలాయితు లైనముసల్మాను సైనికులు నలువురు యుద్ధరంగమున కరమైలు దూరమునఁ గూరుచుండి పైవిధముగా మాటాడుచుండిరి. ఆసమయమునం దొక యశ్వారోహకుఁడు వారివైపునకు వచ్చుచుండెను. భూతభయ మప్పటికిని వారి హృదయములనుండి విడిచిపోలేదు. వారానాఁడు జరిగిన యమానుషికము ను, అసమానమును, అత్యంతసాహసికము నగుయుద్ధము భూతకృత్యమే యని దృఢముగా నమ్మియుండిరి. బాలసూర్యునివలె నున్నయాకృషీకయువకుని యాభీషణఖడ్గసంచాలనము ను, మేఘగర్జనాగంభీరమగు నా"భంభం"శబ్దముతోఁ జేరిన సముద్రఘోషమువంటిముసల్మానుఫకీరునియా"యల్లా హో"ధ్వనియు, ముసల్మానులశరవర్షమధ్యమునుండి రుద్రమూర్తులవలె నున్నయావీరులిద్దఱును జెట్లకొమ్మలచేఁ గొట్టినదెబ్బలును, వారిమనస్సులయందింకను జాగరితము లగుచుండెను. ఆభూతచతుష్టయమునం దొకభూతము గుఱ్ఱపురౌతు వేషమును ధరించి తమ్ము వధించుటకై వచ్చుచుండె నని భావించుకొని యానలువురును భయముతో లేచి పరు వెత్తనారంభించిరి. అశ్వారోహకుఁడు తనగుఱ్ఱమును మఱింత వేగముగాఁ

బరుగెత్తించుచు "భయములేదు, పాఱిపోకుఁడు" అని కేక వే
సెను. పాఱిపోవువారిలో నొకఁడగు రహింఖాను—"అన్నా!
ఆతఁడు మన నవాబని తోఁచుచున్నది." అనియెను. రెండవ
వాఁడు "అయ్యో! మూర్ఖుఁడా! భూతవ్యాపారమును నీ వెఱుఁ
గవు. భూత మేవేషమునైనను ధరింపఁగలదు. నీకు మరణిం
చుట కిష్టమున్నచో నిక్కడనే నిల్వుము. నేను మాత్రము
పాఱిపోయి ప్రాణములను దక్కించుకొని యెదను." అనెను.

అశ్వారోహుఁ డఫ్జుల్ ఖానుఁడే. ఆతఁడు వేగము
గాఁ దనగుఱ్ఱమును బరుగెత్తించుకొని వచ్చి సైనికుల కెదురు
గా నిల్వఁబడి "స్వామిద్రోహులారా! మీరు ముసల్మానులై
యుండియు హిందువులకు భయపడి పాఱిపోవుదురా? కాఫ
రులకు వెన్నిచ్చినచో గతియేమగునో తెలియదా!" అని
పలికెను.

పాఱిపోవుచున్నవారు ధైర్యముతో నిల్వఁబడిరి. వారి
లో రహిమానుఖాను—"హుజూర్! నేనట్లె చెప్పితిని. కాని
యీతఁడు మిమ్ము మాయజమానుఁడు గాఁడనియు, హిందువుల
భూత మనియు, నదియజమాని వేషముతో మనలను జంపు
టకు వచ్చుచుండెననియుఁ బలికినాఁడు" అనియెను.

సైన్యాధిపతి యగు నఫ్జుల్ ఖానుఁడు క్రోధముతో
రహిమానునిపొగరుబోతుతనమునకుఁ దగినశిక్ష గావింపవల
యునని తనకత్తి నెత్తెను. అప్పుడు రహిమానుని వెనుకనిలు

చున్న రెండవవాఁడు మఱింత వెనుకకు జరుగుచు "చూచితివా! మూర్ఖుఁడా! కత్తి నెత్తుచున్నది భూతము! నేను మొదటనే చెప్పితినిగాదా! నామాట యసత్యమా! ఇప్పుడైనఁ బాఱిపోయి ప్రాణమును గాపాడుకొందము రమ్ము" అనెను.

అఫ్జుల్ ఖానుఁ డప్పుడు వారికి భయప్రదర్శనముఁ గావించినఁ బ్రయోజనము లేదని తెలిసికొని తన యోధులతో "మనమీనాఁడు భూతములతోఁ గయ్యమాడఁబోవుచుంటిమని మీ రనుకొనుచున్నారా? అట్లయినచో మనము బ్రదికియుండఁగలమే? భూతములే యైనచో మనల నందఱను జీవములతో విడిచిపుచ్చునా? భూతములచేతికిఁ జిక్కినవారు బ్రదికి బయటఁ బడఁగలరా?" అని చెప్పెను.

రహీం—ఆమాట నిజమే. కాని వారు మనుష్యులే యైనచో వారిలో నొకఁడు ముసల్మానుఁడై పుట్టి హిందువులతోఁ జేరి ముసల్మానులను జంపివేసెనేమి?

అఫ్జుల్—ముసల్మానుఁడు కాఫరు కాఁగూడదా? నేనా కాఫరుని జాలకాలమునుండి యెఱుఁగుదును. అతనియునికి పట్టు కూడ మీకుఁ జెప్పఁగలను. హిందువు లాతనికి లంచమిచ్చిరి. ఆదురాశచే నాతఁడు కాఫర య్యెను.

రహీం—వారు మనుజులైనచో నల్వురుహిందువులు నూటయేఁబదిమందిముసల్మానులను, జూచుచుండఁగనే ముక్కముక్కలుగా ఖండించివేయఁగలరా?

ఈ ప్రశ్నకుఁ బ్రత్యుత్తర మిచ్చుటకు ఖాను సాహేబు నకుఁ బ్రాణములు మీఁదికివచ్చెను. అతఁ డింతుక యోచించి పిమ్మట "మీ రింతటిబుద్ధిమంతులై యుండియు సంగతి గ్రహింపఁజాలక పోయితిరా ? మీరు మొదటనే వారు భూతముల నియు మనుజులు కారనియుఁ దలంచుటచేతనే భయపడి యుద్ధము సాహసముతోఁ జేయఁజాలకైతిరి. ఆ భూతభయముచేతనే యీనాఁడు మనకిందఱకు సర్వనాశము సంఘటిల్లెను. కానిచో యుద్ధమున ముసల్మానులు హిందువుల కోడుటయా? ఖురాను నీనాఁడు మీరు మఱచినట్లున్నారు." అనియెను.

అఫ్జులుఖానుమాటలపైఁ గ్రమముగా నాతనియనుచరులకు నమ్మిక గల్గి అయూలకుముగుశంకచే భయపడి తమవీరులు ప్రాణములను నిష్కారణముగా విడిచిరనియు, మనసుంచినచో ననాయాసముగా యుద్ధమున జయమొందవచ్చుననియు గ్రహించి, అఫ్జుల్ ఖానునిఁ జూచి "ఇప్పు డేలినవారియాజ్ఞ శిరసావహించుటకు సిద్ధముగా నున్నాము" అనిచెప్పిరి.

అబ్దులుఖాను సంతుష్టాంతరంగుఁడై "నేఁడు చేతికి దొరకినమృగము తప్పించుకొని పాఱిపోవుట లజ్జాకరముగనున్నది. ఈసమాచార మెవ్వరు నెవ్వరితోడను దెలుపరాదు. ఎవ్వరైన నడిగినచో "అయిదువేలమందిహిందువులు నేఁడు కత్తి తుపాకి మొదలగునాయుధములతోఁ నాకస్మికముగా వచ్చి యేఁబది మందిముసల్మానులపైఁ బడి కొట్టుటచే వారిలోఁ గొందఱు

ముసలమానులుమాత్రము నశించిరనియు, నష్టము మరణించిన హిందువులకు లెక్కయే లేదనియు సమాధానముచెప్పవలయును. అంతియేకాక యీనాఁడు వచ్చిన ఘనగునకును అమృతగుహిందువులకున దగినశిక్ష చేయకున్న మనకు మరి యీఁద నిలువఁబోను. ఈరణభూమికి రక్షౌసుదూరమునందున్న మసీదునం దొకఫకీరు వాసము చేయుచుండును. ఆహిందువులు ముగ్గురునుగూడ నాతనితో నామసీదునకె పోయియున్నారు. వారేమిచేయుదురో యెక్కడకుఁబోవుదురో గోప్యముగాఁ గనిపెట్టుచుండవలయును. నేనిప్పుడు పాదుషహావద్దకుఁబోయి నేఁటియవమానకళంకమును మాపుకొనుటకై మరల యుద్ధసన్నద్ధుఁడనై వచ్చెదను. శీఘ్రముగనే హిందూస్థానమంతయు హిందూరక్తముచే ముంచివేసెదను. మీరు జాగరూకులై కార్యములు గావించినచో మీకుఁదగుపారితోషికములు లభింపఁగలవు" అనియెను.

నలుగు రనుచరులకును ననుజ్ఞనొసంగి, అఫ్జులు గుఱ్ఱము నెక్కి యజమీరునగ రాభిముఖుఁడై మెల్లమెల్లఁగాఁబయలుదేఱెను. వేగముగా గుఱ్ఱమును బరుగెత్తించుట యాతనికిఁ గష్టముగా నుండెను. ఆతనికి శరీరస్వాస్థ్యము లేకుండెను. యుద్ధక్షేత్రమునుండి పలాయితుఁడగుచున్నప్పుఁడాతని వెన్నుపైఁ జెట్టుకొమ్మదెబ్బ పడి బలమైన గాయమయ్యెను. అనుచరులకుఁ గనఁబాఁటైనతరువాత ఖానుసాహేబు వీఁపు తడవికొ

నను, నోరు తెఱచికొని "ఓరీ, కాఫరా! దురాత్మా!" అను కొనియెను.

---

## నాలుగవ ప్రకరణము.

---

యుద్ధభూమి కరికో సుదూరముననే ప్రాంతమునను నొక మసీదు గలదు. పూర్వమం దిది షాజహాను చక్రవర్తికిఁ బ్రమోదభవన మనియు, నొకనాఁడాతఁడు విశేషవిలాసినీజనసమేతుఁడై యీ ప్రమోదభవనమునఁ బ్రవేశించుచున్నప్పుడు ద్వారమునం దొక ఫకీరును జూచెననియు, ఫకీరు సార్వభౌముని లోనికిఁ దీసికొనిపోయి యేకాంతముగా మాటలాడి యాతని కొక దివ్యపురుషునిఁ జూపించెననియు, నది మొదలు నాప్రమోదభవనము మసీదుగాఁ బరిణమించి యందొక ఫకీరు వాసముచేయుచుండెననియుఁ బ్రవాదముగలదు. సార్వభౌముఁడైన షహాజహాను సంవత్సరమునకు రెండుపర్యాయములు ఢిల్లీనుండి వచ్చి రెండుమూఁడుదినములు ఫకీరుతోఁ గలిసియుండి వెడలిపోవుచుండెననియు ననేకు లనుకొనుచుందురు.

యుద్ధము ముగిసినపిమ్మట స్వల్పకాలములోఁ బ్రసిద్ధ యువకుఁడును ఫకీరును హైందవవీరు లిరువురును మసీదున కెదురుగా వచ్చి నిలిచియుండిరి. అప్పుడు ఫకీరు యువకునిగూ

ర్చి "వత్సా! ఇది హిందుమందిరము. లోపలికేగి యారాధనము సల్పవచ్చును" అనెను.

యువ—ఇది మందిరమా? మసీదా?

ఫకీ—(నవ్వి) పవిత్రమైన ముసల్మానులధర్మమునందు మందిరమునకును మసీదునకును, హిందువులకును ముసల్మానులకును, అల్లాకును భగవంతునకును, మహమ్మదునకును జనార్దనునకును ఖురానునకును నారాయణునకును భేదములేదు. పాదుషాషహాజహానుండు స్వయముగా నీమందిరమును బ్రతిష్ఠించి దీనికి ముసల్మానమందిర మని పేరిడియున్నాడు. కాని యీసంగతులన్నిటిని వివరింపుటకు కిది సమయముగాదు.

ఇట్లుచెప్పి ఫకీరు హిందూవీరులనిరువురిం జూచి "మీరు విశేషకాల మిందుండుట కవకాశము లేదని తోచుచున్నది. నేటిసమాచారము శీఘ్రముగా బాదుషా యౌరంగజేబునకుం జేరంగలదు. అఫ్జుల్ ఖానుం డింకనుం దగినప్రతీకారము సేయ నెన్నియో ప్రయత్నములు సేయును. ఆకారణమున మీరు చేరందలంచుకొనినతావులకు వేగమే చేరుట మేలైనపని" అనియెను.

హిందూవీరులలో నొకండు ఫకీరునకు వందనముచేసి మసీదులోనికిం బోయెను. ఫకీరు రెండవవీరునిం జూచి "మీవీరబాలకుని మీవెంటం గొనిపోవలయు నని యభిలషించుచున్నాను. భవిష్యమునం దీతనిచే ననేకోపకారములు జరుగంగలవు" అనిచెప్పెను.

హిందూవీరుఁడు కృషికయువకుని గాంచి "వీర బాలకా! నాతో వచ్చుటకు నీకిష్టమున్నదా?" అని యడిగెను.

వీర—ఎక్కడకు?"

హిందు—రణసద్రమునకు.

వీర—(హర్షపరిపుల్లనయనుఁడై) వీర శ్రేష్ఠా! నోఁడి బాధపడుచున్న పథికునకు మరల మరీచికను జూపి పిచ్చివాని నింగాఁ జేయుట యెందులకు? రణసముద్రమా? శత్రుపీడితమైన యీయార్యావర్తమునం దారణసముద్ర మెక్కడను న్నది?

హిందూ-నేఁటియుద్ధరంగమునకు నీ వెచ్చటనుండి వచ్చితివి?

వీర-నాపూర్వవృత్తాంతము వివరించుటకుఁ జాలకాల ముపట్టును. ప్రస్తుతము మీకింతవఱకుమాత్రము చెప్పఁగలను-—నేను మీవారు దేశమునందలియొక దరిద్రకృషికుఁడను. అనేక దినములనుండి రణసముద్రమును వెదకుచుంటిని. బాల్యమున నేనొక యమూల్యరత్నమును భోఁగొట్టుకొని యనేకస్థలముల వెదకుచుంటిని. ఆరత్నము రణసముద్రస్థలమునం దుండునని వినియుంటిని. రాఠోరు సేనాపతి యగుదుర్గాదాసుఁడు, ఆరావళీపర్వతోపత్యకలయందు రణవేషముచే సజ్జితుఁడై యమృతమయరణభేరీధ్వనితో నార్యావర్తమునం దున్నవీరుల నందఱను యుద్ధమునకుఁ బిలుచుచున్నాఁడని వింటిని. మీవా

దుంచుసింహ జతగాండ్రున్నారును ద్రోహకపోవుటచే నేనొక్కఁడనే యక్కడకుఁ బోవుటకు బయలుదేఱితిని.

హిందూవీరుఁ డానందముతో లేచి నిలిచి కృత్తికా బాలకు నాలింగనము చేసికొని "వీరబాలకా! నీవెవ్వరిని వెదకికొనుచుఁ బోవుచుంటివో యెఱుఁగుదును — ఆ దుర్గాదాసుని హృదయము నీహృదయముతోఁ జేరినది. తమ్ముఁడా! బయలు దేఱుము! ఆరావళీపర్వతోన్నతశృంగమునుండి యిట్లే హృదయముతో హృదయమును గలుపుకొని వేగముగా రణసముద్రమున మునుఁగుదము.

కృత్తికయువకుఁ డాశ్చర్యముతో హిందూవీరుని దృష్టించి చూచెను. శ్వేతచందనశోభితమైనయాయున్నతలలాటమును, తేజోగర్వశీలములైన యానేత్రములును, శౌర్యపరిపూర్ణమైన యావిశాలవక్షమును, సాలవృక్షశాఖాసదృశములైన యాదీర్ఘబాహువులును, గాంభీర్యమయ మగునా మధురస్వరమును దుర్గాదాసునకుఁదక్క మఱియెవ్వరికుండును! వృక్షశాఖాప్రహారములచే శతాధిక సశస్త్రయవనవీరులను యుద్ధమునం దోడించుటకు దుర్గాదాసునకుఁగాక మఱియెవ్వరి బాహువులయం దట్టిబలము గలదు? దుర్గాదాసుగానిచో "భంభంహర" నినాదముతోఁ బ్రాణశూన్యములైయున్న హిందూదేహములపై నమృతవర్షమును గురియించి సజీవములుగాఁ జేయఁగల వారెవ్వరు?

కృషికయువకుఁ డాశ్చర్యముతో నామహావీరుని తేజోమూర్తిని జూచుచుండెను. అప్పుడు దుర్గాదాసు "బాబా! భయములేదు. నీయాశ ఫలించును రమ్ము. మారాజమహిషీ సందర్శనము చేయించి వారికి నీపరిచయమును గూర్చి విన్నవించెదను" అని చెప్పి దుర్గాదాసు కృషికయువకుని చేయిపట్టుకొని మసీదులోనికిఁ బోయెను. మసీదుమధ్యమునం దొక గొప్పయంగణ ముండెను. ఆయంగణమునం దడవితీఁగ లల్లుకొనియుండెను. పూర్వమం దది లేదు. పుష్పోద్యానముగా నుండెడిది. ఇప్పుడందలి వివిధవర్ణములును, వివిధసౌరభములును గల యనాఘ్రాతపుష్పములు, ఆనిర్జనకాననమున నీరవముగా వికసించి, యానిర్జనప్రదేశమున నిశ్శబ్దముగాఁ బరిమళములఁ బ్రసరింపఁజేసి, నిశ్శబ్దభాషలో నెన్నియో ప్రేమభరితభాషణముల నాడుచుండెను, మీఁద నాకాశమున శశాంకుఁడు నిశ్శబ్దముగఁ గిరణములఁ బ్రసరింపఁజేసి వికసించినయాపుష్పదళ పరిమళములందు నిశ్శబ్దముగా నమృతము వోయుచు నిశ్శబ్దముగా నవ్వుచుండెను. ఆనిశ్శబ్దనీరవకాననమునందు రమణీమణులిరువురు నిశ్శబ్దముగా నిలిచియుండిరి. దుర్గాదాసు యువకునిఁ గూర్చి "వీరబాలకా! అభివాదనములు చేయుము. నీయెదుట యోధపురరాజమహిషియగు రాణీ యరుంధతీదేవియు, వారి పార్శ్వమున నంబర రాజకుమారియగు నంబాలికయు నిలిచియుండిరి." అని చెప్పెను.

కృషికయువకుఁడుచూడఁగా నెదుటనిరాభరణయై పట్టువస్త్రమును ధరించినరాజమహిషియు—ఆమెపార్శ్వమున-ఆహా! ఎంతటి సౌందర్యము! చంద్రికాంతశిలచే నిర్మింపఁబడిన సరస్వతీమూర్తివలెఁ, బలమునఁ జిత్రింపఁబడినభువనేశ్వరివలె, భక్తజనులయెదుటఁ బ్రత్యక్షమైనజగద్ధాత్రీప్రతిమవలె-ఆహా! యిది స్వప్నమా! ఒకనాఁడు కృషికునకు శైశవమునందు, ఎనిమిదివత్సరములకుముందు, ఆహేరియామహోత్సవదినమునందు రాజసముద్రసరోవరతీరమునందు, ఒకసారిచూచి పోఁగొట్టుకొనినయ్యాయపార్థివనిధియిదిగో! హరునిజటాజూటమునుండి జాఱినసుధాంశులేఖ యెనిమిదివత్సరములకుఁబిమ్మట నిన్నటిసాయంకాలస్వప్నమునందు రత్నగిరిపై మందాకినీతరంగములయందుఁ బూర్ణసౌందర్యముతోడను, షోడశకళలతోడన సాక్షాత్కరించెను—అది యిదియేనా? అవును. పరిపూర్ణసుధాకరస్వరూపయు, దివ్యకాంతివిభాసితయు, నగునామనోహరమూర్తియే యిది!

కృషికయువకుఁడు దుర్గాదాసునియాజ్ఞాప్రకారము నేలపై మోకాళ్లనూని యభివాదనము సేయఁబోయి చైతన్యశూన్యుఁడై యామనోహరమూర్తిపాదములపై నొఱగెను. ఆకస్మికముగ, నకారణముగ నంబరరాజకుమారిక యగునా బాలికకు దేహము కంటకితమై హృదయము ప్రకంపితమై యామె చైతన్యశూన్యయగుచు "హా దేవీ! స్వప్నము సత్యమగుట

కలదా?" యని రాజపుహిషిపాదమూలమునఁ బడి మూర్ఛిల్లెను.

---

## అయిదవ ప్రకరణము.

---

ఔరంగజేబు సింహాసనమునకు వచ్చిన కొలఁదికాలమునకే యమితపరాక్రమశాలియు, యోధపురరాజునగు యశోవంతసింహుని, అంబరాధిపతియు, వీరకేసరియు నగుజయసింహుని వినాశనము గావింపకున్న నార్యావర్తమునఁ బడి హిందువుల గౌరవము నిలుప్తమగుట సంభవింపదని గ్రహించెను. స్వల్పకాలమునందే యాతనిదేవరక్తతృష్ణ తృప్తిని బొందెను. పాపపూర్ణావతారుఁడగునౌరంగజేబు యువరాజగు పృథ్వీసింహుని వినాశ మొనరించి, విషప్రయోగముచేఁ బుత్రశోకాతురుఁడగు యశోవంతసింహుని యమూల్యప్రాణములను, వీరధర్మపరాయణుఁడగు జయసింహుని నిరుపమానజీవములను హరించివేసెను. కాని, యాతఁ డంతటితోఁ దృప్తుఁడు గాలేదు. యోధపురరాజునకు నూతనముగా నుద్భవించినశిశువును దుదముట్టింపకున్న నాతనిచిత్తమునకు శాంతియెక్కడిది? సామ్రాట్టు తన యనుచరులనుగూర్చి..."కౌశలముచేనైన, బలప్రయోగము చేనైన,నాశాపరిదర్శనముచేనైన శిశువగురాజకుమారుని దల్లి చేతులనుండి తప్పించి తీసికొనివచ్చి వధింపవలయు"నని యా

జ్ఞాపించెను. కఠినచిత్తుఁడగునాపామపానిష్ఠురాజ్ఞ దుర్గాదాసునకుఁ దెలియవచ్చెను. ఆతఁడు పుత్రశోకాతురయై పతివియోగవ్యసనభారాక్రాంతయై యున్నరాజమహిషిని, ఆమెపుట్టినిల్లయినమీవారునకుఁ దీసికొనివచ్చి కొంతకాల మక్కడ నుండుటకు నేర్పాటుగావించి యుద్ధప్రయత్నములు చేయుచుండెను. ఆసమయమునందు,అంబరరాజగుజయసింహుని రెండవ భార్య తనయాఁడుపిల్లను రాణాకు నొప్పగించి తానగ్నిప్రవేశముఁగావించుటకు మీవారునకు వచ్చెను. ఈకథాప్రారంభమునఁ బాఠకులు భర్తృవిహీనయగు నంబరరాణిని రాజసముద్రసరోవరపార్శ్వమునయున్న విష్ణుమందిరమహాద్వారమునందును, ఆమెకొమార్తెను గింశుకతరువుక్రిందను జూచియున్నారు. ఉదయపురమునందు భర్తృవిహీన లగు రాణుల కిద్దఱకుఁ బరస్పరసందర్శన మయ్యెను. అంబరరాణి తనయాఁడుపిల్లను యోధపురరాజ్ఞిమణి కొప్పగించి మృతపతిని గలిసికొనుటకై చితారోహణము గావించెను. అదిమొదలు నేఁటివఱకున నెనిమిది వత్సరములకాలము, అంబరరాజకుమారిక యగు నంబాలిక మహారాజ్ఞీమణి యగునరుంధతీదేవిసంరక్షణమునం దేయుండెను. వీరవరుఁడగు దుర్గాదాసు యుద్ధసన్నాహములను బూర్తిగావించుకొని, యశోవంతసింహుని కుమారుఁడగు నజితసింహుని బట్టికొనిపోయి దుర్గమమగునాపర్వతముపై నేకాంతస్థలమున దాఁచియుంచెను. విశ్వాసపాత్రుఁడగు సేనాపతి ముకుందదా

సునకును, బ్రిభుభక్తిపరాయణులగు మరికొందఱనుచరులకు ను దక్క మఱియెవ్వరికి నామెయేకాంతస్థలము తెలియదు. వీర రమణి యగునరుంధతీదేవియు దుర్గాదాసునిం దనచెంతనిల్పి కొని యక్కడకుఁజేరిన మిగిలినవీరులను యవనులతో యుద్ధము గావించుటకుఁ బ్రోత్సహించుచుండెను. అప్పుడప్పుడతిరహస్య ముగఁ బోయి కుమారునిఁ జూచి వచ్చుచుండెడిది. నేఁడు కు మారునిఁజూచి తిరిగివచ్చుచుఁ గాళిందీతీరమునందు ముస ల్మానుఫకీరునిమందిరమునందు విడిసెను. ముకుందదాసుగూడ నామెతో ఫకీరునిమందిరమువఱకును వచ్చెను. దుర్గాదాసు వృద్ధఫకీరును బాల్యమునుండియు నెఱుంగుటయేకాక, అనేక కార ణములచే నాతనిఁ దనగురువుగా భావించుచుండెను.

అది శరత్కాలము—ఆశుక్లపక్షపురాత్రి క్రమముగాఁ గడచిపోవుచుండెను. చంద్రుఁడు రాత్రియంతయు జాగరము నరించి యలసి, పశ్చిమదిశకు వచ్చి విశ్రమించుటకై యాకాశ ప్రాంతమునుండి దిగుచుండెను. కొండలలోయదారిలోనొకప్రక్క గా దుర్గాదాసుఁడుమార్గాయాసముచే నలసి నిద్రించుచుం డెను. ఆతనిపార్శ్వమునఁ గృపిక యువకుఁడుశయనించియేదిరాగా యాలోచించుకొనుచుండెను. వారిరువురకనతిదూరమున నరుం ధతీదేవియు, నామెచెంగట రాజకుమారికయం బాలికయునేలపైఁ బరుండియుండిరి. అరుంధతికినిద్ర—అంబాలిక మార్గశ్రమనలసినను నామెకు నిద్రపట్టలేదు. ఆమె నీలోత్పలములఁబోలుతెనకన్నుల

విప్పికొని యస్తంగతుఁడగుచున్న చంద్రునిఁజూచుచుండెను. కృషికయువకుఁడు తనవలె రాజకుమారికకుఁ గూడ నారాత్రి నిద్ర పట్టుటలేదని యెఱుంగఁడు.

ఆకస్మికముగా స్వల్పదూరమునుండి విశేషముగా గుఱ్ఱపుడెక్కలచప్పుడులు వినవచ్చుచుండెను. కృషికయువకుఁడు చకితుఁడై లేచి మొలలోనికత్తి నోఱనుండి తీసి దుర్గాదాసుని మేలుకొలిపి "భగవాన్! లెమ్ము. నీకత్తి నోఱనుండి తీయుము. బహుసంఖ్యాకులగుశత్రుసేన వచ్చుచున్నట్లున్నది." అనెను.

దుర్గాదాసు లేచి యశ్వారోహకు లగుయవనసైనికులనేకులు దమ్ము సమీపించినట్లు గ్రహించి "మన మున్నవారమిరువురము. కరవాలమునకు శోణితతృష్ణ తీరఁగలదు—కాని రాజమహిషిని రాజకుమారిని రక్షించువారెవ్వరు?" అనెను. యువకుఁడు "మార్గము చాలనిఱుకుగా నున్నది. ఒక్కమాఱుగాఁ జాలమందిగుఱ్ఱపురౌతులు ముందఱికిరాఁజాలరు. మీరు రాజమహిషిని రాజకుమారిని వెంటఁబెట్టుకొని పోయినచో శత్రుసైన్యము ముందఱికి రాకుండ నిక్కడనే నిల్పివైచెదను." అనియెను.

క్షణమాత్రము యోజించి యువకుని సుకుమారవదనమును జూచుచు దుర్గాదాసు "అంతకంటె వేఱుపాయము లేదు. సాధు! వీరబాలకా! సాధు! వీరునివలెఁ బ్రాణము

లను వినర్జింపుము ! స్వర్గమున దానికిఁ బురస్కారము గలదు." అని చెప్పి రాజమహిషిని జూచి. " అమ్మా ! ఆలసించుట కవకాశము లేదు. అశ్వము నధిరోహింపుము " అనెను.

కృషికయువకుఁడు ప్రఫుల్లవదనుఁడై రాజకుమారిముఖమండలమును జూచెను. ఆచూపులలోనుండి "సాకారమునఁ బ్రాణముల నర్పించుటయు సుఖమే" అను భావమున్నట్లు రాజకుమారి గ్రహించెను. దుర్గాదాసు విషాదముతోడను, అభిమానముతోడను గన్నులు నలిమికొనుచు గుఱ్ఱము నెక్కెను. రాజమహిషియు నంబాలికనెత్తికొని యశ్వము నధిరోహించెను. అంబాలిక గుఱ్ఱపుకళ్లెమును బట్టుకొని నిలిపి "దుర్గాదాసా! నీవు క్షత్రియవీరుఁడవు గావా? నేఁడు ప్రాణభయమున శత్రువులకు వెన్నిచ్చెదవా?" యనియెను. దుర్గాదాసు గంభీరస్వరముతో "అమ్మా! ఆఁడుబిడ్డలయుపదేశమును వినుట కిది సమయము కాదు. రాజమహిషీ! గుఱ్ఱమును బరుగెత్తింపుము. నిలిచి యాలసించినచో మిమ్ముల రక్షించుట నాకు సాధ్యముకాదు." అనియెను. అంబాలిక మరలఁ గళ్లెమును బలముగా బిగించి పట్టుకొనియెను. అప్పుడు రాజకుమారి "వత్సా ! నీ స్థాన మీదినమున నెక్కడకుఁ బోయినది?" అనియెను.

అంబా—(కన్నులు నీరునిండ బిగ్గరగా) దేవీ! మీకుఁ బ్రాణములపై భయమున్నచో మీరు దుర్గాదాసుతోఁ బలాయనము గావచ్చు—నేను వీరబాలకుని—

కత్తులఝుణఝుణశబ్దములందును శతృవులహుంకార ధ్వనులయందును రాజకుమారికకంఠస్వర మణఁగి విలీనమై పోయెను. చూచుచుండఁగనే శత్రుసైనికులకత్తులు కృషిక యువకుఁ డెత్తియున్న కత్తిపైఁ బడి ప్రతిహతములు గాఁజొచ్చెను. ఆమె యనేక యుద్ధములలో నున్మత్తులగువీరులఁ గాలాంతకమూర్తుల ననేకపర్యాయములు చూచియుండెను. కాని యసహాయుఁ డగునొక్క బాలునికత్తి కెదురుగ సశస్త్రు లగుచిన్నూర్గురుయోధులు నిలిచి యెదుర్చుటయును, అట్టిసుంద రసుకుమార బాలకునివక్షమున నేక కాలమున వన్నికత్తు లాకస్మికముగఁ బడుటయు నామె యెన్నఁడుఁ జూచియుండలేదు; వినియుండలేదు. రాజకుమారికి దృష్టిశక్తిలోపమై క్రమముగా నామె చైతన్యవిహీన గాఁజొచ్చెను—అప్పుడామె "హా, కత నాత్మజ వగునోదుర్గాదాసా! ఇదియేనా నీ వీరధర్మము." అని యనుచు రాణిభుజముపైఁ దలవాల్చి మూర్ఛితయయ్యెను. రాజమహిషియు రాథోరు సేనాపతియు గుఱ్ఱములను బరుగెత్తించుకొనుచుఁ బర్వతశృంగముల దాఁటిపోయిరి.

---

## ఆఱవప్రకరణము.

---

ప్రభాతసమయమున ఫకీరునిమందిరద్వారమున నొక నారీమణి యొంటిగ నిలిచి యుండెను. ఫకీరు నేలపై మోకాళ్లూని వీరాసనమునఁ గూరుచుండి, యెదపైఁ జేతులను జేర్చి

కొని, కన్నులు మూసికొని భగవానుని స్తోత్రము చేసికొనుచుండెను. యవనభాషలోఁ గాదు ...పవిత్రదేవభాషలో-దివ్యకంఠముతో నానిర్జనమందిరము ప్రతిధ్వనించునట్లును, అమృతమయవిశుద్ధశబ్దోచ్చారణచేఁ బార్శ్వస్థిత యగురమణీదేహము పులకితమగునట్లును ముసల్మానుయోగి యనాదిదేవునారాధించుచుండెను. ఇంచుకసే పైనపిమ్మట నాతఁడు కన్నులు తెఱచి, చెంత నిలిచియున్నరమణినిఁ జూచి "వత్సా! నేను నీముఖమండలము కందువాఱియున్నది; మఱి యేదైన నశుభసమాచారము కల్గినదా?" అని యడిగెను.

రమ—(చేతులు జోడించుకొని) తెమయుఁ జ్ఞానబొందిపోవుటకై వచ్చితిని.

ఫకీ—ఎక్కడకుఁ బోఁగోరుచున్నావు ?

రమ—స్వామీ ! అభాగిని నకారణముగా నిట్లు ప్రశ్నించితిరి. నాహృదయభావములలో మీ కెఱుంగని దేమి కలదు ?

ఫకీ—(విషణ్ణవదనముతో) మందభాగినీ ! తెలిసినది. నీవు దుర్గాదాసుని గిరిదుర్గమునకుఁ బోఁగోరుచున్నట్లున్నావు. కాని కొన్నివిషయములకుఁ బ్రత్యుత్తర మిత్తువా?

రమ—ఆజ్ఞ యొసఁగుఁడు !

ఫకీ—నిన్న నాకృషిచేసినవీరయువకునిఁ జూచియుంటివా?

రమ—స్వామీ ! యవనులు నిరపరాధు లగుహారదే

వపురవాసులచేఁ బడి యనేకదుర్నయము లొనరించుచుండఁ గాంచి, తమ కాసమాచారము విన్నవించుటకై వచ్చుచున్న ప్పుడు త్రోవలో నొంటరిగఁ బరుండియున్న యాబాలకుని గని యాతని వెంటఁబెట్టుకొనివచ్చి మీకాసమాచారము నెఱింగించితిని.

ఫకీ—ఆతఁడు నిన్ను గుర్తించెనా?

రమణ—ఆతఁడు నన్నెట్లు గుర్తింపఁగలఁడు?

ఫకీ—నీవాతఁ డెవ్వఁడని యెంచితివి?

రమ—స్వామీ! అపరాధమును క్షమింపవలయును, మీరంతర్యాములై యున్నను నాహృదయమును దెలియరైతిరి.

ఫకీ—అయినచో యిఁక నీవాతనినిఁ జూచుటకుఁ బ్రయత్నింతువా? గిరిదుర్గమునకు నాతనిని జూడఁగల వనునిశ్చయ మెక్కడిది?

రమ—మీరు భ్రమఁజెందుచున్నారు. ఆతనినిఁ జూడవలయుననునాశ నాకు లేదు. ఆతఁడు నన్ను గుర్తింపకుండుట యును మంచిదియే. నాపరిచయమువలన నాతని కేమిలాభము? నిన్నరాత్రి మందిరమున నంబరరాజకుమారియు నాతఁడునుఁ గలిసికొనినప్పుడు నేను వారిహావభావవిలాసముల నట్లే చూచుచుంటిని తరువాత రాజకుమారివలన ననేకవిశేషములఁ దెలిసికొంటిని. అదిమొదలు నాహృదయమునం దొక

కీర్తియాస యుదయించి, శత్రువధాభిలాషము హెచ్చి నాటండిగ్రిని జంపినవారిపైఁ గలప్రతిహింసానలము ప్రజ్వరిల్ల సాగెను. మీబిడ్డవాచాలతకు మన్నింపవలయును. వీరునిహృదయము నారీప్రేమోన్మత్తమైనచో నసాధ్యకార్యసాధనమగును. ఆతఁడు యవనయుద్ధమున జయలాభ మొందుటచేఁ దన పవిత్రప్రేమము చరితార్థమగునని గ్రహించినచో నచిరకాలముననే యార్యావర్తమునఁ దాతటను యవనరక్తప్రవాహము ప్రవహించి, భారతవర్షము శత్రుశూన్యమై యార్యవిజయోత్సవము సంఘటిల్లఁగలదు. అప్పుడు స్వామీ! ఆజయమహోత్సవమున మఱియొక మంగళోత్సవము లభించినచో జన్మము చరితార్థము కాఁగలదు.

శకీ—(దయార్ద్రహృదయముతో) బిడ్డా! ఇప్పుడు నీచిత్తము నీస్వాధీనమునం దుంచుకొనఁగలవా?

రమ—(చేతులు జోడించుకొని) మీప్రియశిష్యుని తనయ నగువాకు మీకటాక్షమువలనఁ జిత్తము స్వాధీనమునం దుంచుకొనుట యసాధ్యకార్యముగాదు. మీరాశీర్వదింప వలయును. ఈహృదయము మీ మహిమామాహాత్మ్యమున సురక్షితము గావింపఁగలను.

రమణి శకీరునకు వందన మాచరించి వెడలిపోయెను. పోవునపు డెల్లను శకీ రాశీర్వాదము చేయుచుండెను. ఈదినమున

నాశీర్వదించుట మఱచిపోయెనని యామె హృదయమునకు స్ఫురణకు వచ్చినప్పుడెల్ల మాటిమాటికిఁ గన్నీరు వెలువడఁజొచ్చెను.

రమణి వెడలిపోయినపిమ్మట ఫకీరు క్రమ్మఱఁ గన్నులు మూసికొని ధ్యాననిమగ్నుఁ డయ్యెను. ఇంచుక సేపైనపిమ్మట నాతఁడు కన్నులు తెఱచి చూచునప్పటికి బహుసంఖ్యాకు లగు ముసల్మాను సైనికులు సంకెలలతో నున్న క్షత్రియయువకునితో మందిరములోనికి వచ్చి చేరిరి. సైన్యములకు నాయకుఁడైన అఫ్జుల్ ఖానును జూచి "ఫకీరు మీరు నన్ను రాజద్రోహినని పట్టుకొని బాదుషహావారియొద్దకుఁ గొంపోవుటకు వచ్చియున్నారని నేనెఱుంగుదును. నడువుఁడు. బలప్రకాశమువలనఁ బ్రయోజనము లేదు. నేను సిద్ధముగానే యున్నాను" అనియెను.

అఫ్జుల్ ఖానుఁడు తనయనుచరునిఁ జూచి "చెవుల కింపగు నీ కాఫర్ ఫకీరుని మాటలను విని మోసపోకుఁడు. ఈతనికిని సంకెలలను వేయుఁడు" అనియెను. ఫకీరు నవ్వుచు ముందటికి వచ్చి సంకెలకై చేతులనిచ్చెను.

---

## ఏడవప్రకరణము

---

ప్రభాతసమయమున "అజమీరు" నగరమునఁ బాదుషావారిదర్బారు. రాజప్రాసాదమునకు ముందువైపున దర్బారుమహాలు మస్తాబు చేయఁబడియెను. చంద్రకాంతశిలానిర్మి

తము లగువిశాల స్తంభములు కాంతియుయ మణిముక్తాభరణములచే శోభిల్లుచుండెను. దానిపై వజ్రపుగుత్తులు వ్రేలాడుచున్నవితాన మలరారుచుండెను. నక్షత్రవిరాజిత మగుగగనతలము నంటి, ప్రకాశమానము లగుముత్యాలపూలచెట్లు, పద్మరాగపుష్పములచేతను, అయస్కాంతపల్లవములచేతను విలసిల్లు కొమ్మలతో వ్యాపించియున్న ట్లగపడుచుండెను. సభామండపమధ్యమునం దున్న రత్నసింహాసనమునందలి మణికాంతులు సూర్యరశ్మిలచేఁ బ్రతిఫలితములగుచు ముక్తాఖచిత స్తంభములపైనున్న మణిమయచాంద్రితపమునందును, సభాసదుల యుష్ణీషములందును వివిధవర్ణకాంతులను బ్రసరింపఁజేయుచుండెను. దర్బారున కిరుగడల నొక్కరీతిదుస్తులను ధరించి కదలమెదలకున్న సైన్యదళము చిత్రప్రతిమలవలె నిలిచి యుండెను. రత్నసింహాసనము శూన్యమై యుండెను. పాదుషహా యింకను రాలేదు. ఆ యసంఖ్యాక సేనాదళమును ఉమ్రావులును పాదుషహావారి యాగమనమును నిశ్శబ్దముగా నిరీక్షించుచుండిరి. రాజభటులయధీనమునం దున్నకృషికయువతుఁ డొకపార్శ్వమున ముసల్మానుఫకీరుతో నిలుచుండి పాదుషహావింతదర్బారును దిలకించుచుండెను; మఱియు గంభీర మూర్తులను దాల్చి సువర్ణోష్ణీషధారులై దీర్ఘములైనతమగడ్డములను సవరించుకొనుచు సముచితాసనము లధిష్ఠించి మౌనధారులై దర్పముగాఁ గూరుచుండియున్న సభాసదులముఖమండలములను దృష్టించి చూచుచుండెను. ఆవిశాలసభామండప

మునం దొక్కహిందువృద్ధుఁడనను వాని కగపడలేదు. నిశ్శబ్దము గానున్న యాసభామండపమునందంతట నాకస్మికముగా "సల్లా హొఆక్బర్" అను గంభీరధ్వాన మొక్కమాఱుగా బయలు దేఱెను. ఆశబ్దముతో సైనికులు సమాన్యులు నొక్కమాఱుగా లేచి వంగి నేలను ముట్టి వందనములు గావించిరి. పిమ్మట నొక్కనిమిషములో సభాస్థానమంతయు మరల నిశ్శబ్దమయ్యెను. కృషికయువకుఁడు చూచుచుండఁగనే యనర్ఘ మణిమయభూషితుండును, వామనాకారుండు నగుషాదుషహా యొంటరిగా నగుమొగముతో వచ్చి సింహాసనముసఁ గూరుచుండెను. ఔరంగజేబు ముహూర్తమాత్రమే మౌనముగ నుండెను. పిమ్మట నాతఁడు సభామండపము ప్రతిధ్వనించునట్లు ధీరగంభీరస్వరముతో సభాసదుల నవలోకించి "ముసల్మానుఉమ్రావులారా! సనాతనమహమ్మదీయధర్మపరిచారకులారా! మన యింతవఱకును సమగ్రభారతవర్షమునందు మహమ్మదీయధర్మ మొక్కటియే వ్యాపించునట్లు శ్రమపడి చేసినప్రయత్నము లన్నియు—నేఁడు మాకు వచ్చినవార్తయే నిజమైనచో—గాలిలోఁ గత్తిని విసరినట్లే విఫలములైపోవును. వృద్ధముసల్మానుఫకీరొకఁడు ముసల్మానుధర్మద్రోహులైన హిందువులపక్షము వహించి బహుసంఖ్యాకులైనయవనవీరుల ప్రాణములను హరించెనని అఫ్జుల్ ఖాను చెప్పుచున్నాఁడు. అందువలన సేనాపతి యాముసల్మానుఫకీరునకుఁ దగినదండనము విధింపుఁడని వేఁడుచున్నాఁడు. కాని మేమట్టియుపవాద

మున విశ్వసింపఁజాలము. అఫ్జుల్ ఖాను వచ్చిన యీయపవాదవృత్తాంతము ఋజువుపఱుచుకొననిచో మేమది యబద్ధాలకమనియు నసత్యమనియుఁ ద్రోసివేయఁగలము" అనియెను.

వృద్ధుఁడగు సభాసదుఁ డొకఁడు కోపభరితుఁడై లేచి నిలుచుండి "జహాపనా! ఇది యసంభవము. స్వయముగా మహమ్మదుని యవతారముధరించిన యాలంగీరు పాదుషహా వారిరాజ్యమందు ఫకీరు కాఫరులతోఁ జేరుననట మేము స్వప్నమునందును విశ్వసింపఁజాలము. అఫ్జుల్ ఖాను తగినప్రమాణములను జూపింపనిమ్ము; అట్లు కానిచో నాతనికి విచారణమునందే యుచితమగు రాజదండనము విధింపవలయును." అనిపలికెను.

అఫ్జుల్ ఖాను చేతులు జోడించుకొని "ఆఫకీరు సభాస్థానమునందే యున్నాఁడు. ఆతనినే యడుగవచ్చును" అనియెను.

ఔరంగజీబు నగుమొగముతో ఫకీరుని జూచి "మీరు ముందఱికి వచ్చి యిచ్చటిసభాసదులసమీపమున నిలిచి ఫకీరనుపవిత్రనామమునకు సంభవించిన ఘోరాపవాదకళంకము దొలఁగించుకొనవలయు." అనెను.

ఫకీరు ముందఱికి వచ్చి సార్వభౌముని రత్నసింహాసనమున కెదురుగా నిల్చఁబడియెను. సభాసదులందఱు ననింద్యమగు నాకాంతిని, నపూర్వమగు నామూర్తిని దదేకదృష్టితోఁ

జూచుచుండిరి. హాసమయమగు నాతనిముఖమండలమునాదలి శ్వేతశ్మశ్రురాశి పవనస్పర్శముచే సంచలించుచుండెను. శుభ్ర జటాజూటముచే దీర్ఘమైనయాతనివిరిదేహము నగ్నపువఱకు నాచ్ఛాదింపబడియెను. కన్నులయందలిదివ్యోజ్జ్వలకాంతి కడలంబుచుండెను. విశాలలలాటము దివ్యజ్ఞానగౌరవముచేఁ దేజఃపుంజముల వెలార్చుచుండెను. ఫకీరు తేజోమయకటాక్షములచే సభాసదుల నీక్షించి సాలశాఖాసదృశములైన తినదీర్ఘ బాహువులను బైకెత్తి గంభీరస్వరమున "భారతసార్వభౌమా! సభాసదులారా! వినుఁడు. సేనాపతి యగు నఫ్‌జుల్ ఖానుఁడు చెప్పినదంతయు సత్యము. ఎనుబదిసంవత్సరములకాలము భగవానుఁ డగు మహమ్మదుపవిత్రోపదేశముల నధ్యయనము చేసి వానినుండి నేర్చికొనినపవిత్రధర్మముల ననుసరించి యదూరదర్శియు నీచాశయుండును స్వార్థపరాయణుండు నగు నీ ఫాదుషహా నిష్ఠురరాజనీతికి విరుద్ధముగా నస్త్రధారణము చేసితిని. అమితవిక్రమశాలి యగు మొగలసమ్రాట్టునకు విరుద్ధముగా సంసారత్యాగియు, హీనబలుఁడు నగునావంటిఫకీరు చేయుబలప్రయోగము మదించిన యేనుఁగుతుండముపై దోమ కుట్టినట్లగును. కాని యీనశ్వరనరదేహమునందు రక్తసంచాలన మెందాఁక నుండునో, ఈబాహువులయందుఁ బసిబాలునిశక్తివంటి శక్తి యెందాఁకనుండునో యందాఁక నేనిప్పటివలెనే పాపపుణ్యములనడుమ జరుగుచున్న యుద్ధములయందుఁ బాప

మున కెదురుగా నిలుచుండి ప్రాణములపైనాశవదలి యుద్ధము చేయుచుండెదను. ఇదియే నాకిహపరధర్మసాధనము. ఇది నా యిష్టగురుదేవుఁడగుమహమ్మదునిసత్యసనాతనధర్మసారోపదేశము." అనియెను.

సభామండప మాశ్చర్యముచే స్తంభితమైపోయెను. ఫాదుషహా క్షణకాలమూరకుండి గంభీరస్వరముతో మెల్లమెల్లఁగా "వినుము, కపటాచారి యగు కాఫరునికంటెను నీచుఁడవగుఫకీరువేషపాషండా! నీవిప్పుడు నీపాపపునాలుకచే మహాత్మునామోచ్చారణముగావించి యిక్కడిముసల్మానమాత్రులకర్ణకుహరములఁ గళంకితములు చేసితివి. కాఫరుధర్మధ్వంసులగు నీవీరసైనికుల హృదయములయందు విషమయవేదనను గల్గించితివి. పవిత్రమహమ్మదీయ రాజసింహాసనమునకు ఘోరతరావమానమును గూర్చితివి. అందువలన నీవిచారణమునందు గావించుచున్న భారతసార్వభౌమునియాజ్ఞను వినుము. రేపటిప్రభాతమున నీపాపపునాలుకను గటికవానికత్తిచేఁ దుండతుండములుగా ఖండించి ముసల్మానధర్మావలంబులగుప్రజలసమ్ముఖమున నిన్నుఁ బందికాళ్లచేఁ ద్రొక్కించెదన" అని యాజ్ఞాపించెను.

సభాసదులెల్లరు దివ్యకాంతిసమన్వితుఁడగుఫకీరునివధను గూర్చినరాజాజ్ఞను విని యాశ్చర్యపడి ఖిన్నులైరి. ప్రధానమంత్రియగు "దిలియార్ ఖాను" లేచి చేతులు జోడించుకొని

"జహాపనా! ఈమనుష్యుఁడు ముసల్మాను ఫకీరుఁడై యున్నసంగతి మఱచినట్లు తోఁచుచున్నది." అనియెను.

సమ్రాట్టు కోపకంపితస్వరముతో "దిలియార్! ఊర, కుండుము. కాఫరును ముసల్మానని చెప్పువానికి మరణదండనము విధింపవలయు నని "ఖురాన్‌షరీఫ్" నందున్నది" అనియెను.

ఆక్షేపించుట కింకెవ్వరును సాహసింపలేదు. ఉమ్రావులందఱును మౌనగంభీరభావముతోఁ బకీరునియచలితముఖమండలమును జూచుచుండిరి. కేవల మఫ్‌జుల్ ఖానునిముఖమునందు మాత్రము హర్షచిహ్నము లగపడియెను. ఆతఁడు లేచి నిలిచి "ఇఁక నీఫకీరువేషపాషండుని యనుచరుఁడగు కాఫరుయువకుని విషయమునఁ దగినరాజదండనమున కాజ్ఞపయ చేయవలసియున్నది" అనియెను.

హిందూయువకుని, ఉమ్రావులయెదుటికిఁ దీసికొని రండని పాదుషా యాజ్ఞాపించెను. కృషికయువకుఁడును సభాసదులయెదుటికి వచ్చి నిలిచెను. పాదుషహా యిట్లు చెప్పఁదొడఁగెను.—"మీయెదుట నిలువఁబడినసుకుమారసుందరయువకుఁడు జాతియందు హిందువుఁడయ్యును వీరత్వమునందు మీయందలిముసల్మానువీరశ్రేష్ఠునకు సమకక్షివీరుఁడై యుండెననితోఁచుచున్నది. అందుచే నీతనిని ముసల్మానుమతమునఁ జేర్చికొని మీవలె నుచ్చపదస్థుని గావింపవలయుననిమాయభిప్రాయము.

ఈతఁడు మహమ్మదీయమతధర్మదీక్షితుఁ డయ్యెనేని దినదినము మాసింహాసనగౌరవము వృద్ధిపఱుపఁగలఁ డని విశ్వసించుచున్నాము. హిందూయువకుఁడా! ఉమ్రావులకువందనముచేయుము. నీయదృష్టము మంచిదయ్యెను. నేఁటిసాయంకాలము నమాజుచేయుటకుముందు వీరందఱును మహోత్సాహముతో నిన్ను సత్యమగుముసల్మానుధర్మమునందు దీక్షితునిఁ జేయుదురు. పిమ్మట నిన్ను బహుమానపురస్సరముగా నమ్రావుపదవియం దుంచి నీవీరత్వమునకుఁ దగినట్లు సంభావింపఁగలరు."

నిర్భీకుఁడగుయువకుఁడు మందహాసవదనుఁడై ప్లుతస్వరముతో "భారతసార్వభౌమా! యవనులపరిచయము హిందూవీరునకుఁ దగినబహుమానమే యగును. ఈబాహువులు రెండును, ఆర్యధర్మమునకు విరోధియైనదానవునివక్షమును జీల్చుటకు సృష్టింపఁబడినవి—యవనచరణసేవకై సృష్టింపఁబడలేదు" అని ఘంటాపథముగఁ బలికెను.

బాదుషహా ఆరక్తనేత్రుఁడై నలుదెసలఁ జూచి క్రోధవిషాదములతో "హా, ఉమ్రావులారా! ఇప్పుడు నేను జాగ్రదవస్థయందు స్వప్నమును గాంచుచున్నాను. కాలభుజంగము పడగపైఁ గాలుంచినట్లైనది; మృగేంద్రునిశిరమున గుంటనక్క గోరుగుచ్చినట్లైనది. నేనిప్పుడు మేలొ్కనఁగల్గితిని. మఱేమి? కటికవానిని బిలిపింపుఁడు" అని స్థిరస్వరముతోఁ బలికెను.

సైనికదళమధ్యమునుండి కాలాంతకమూర్తివలె నున్న కటికవాఁడొకఁడు దూసిన కత్తితో ముందటికివచ్చి నిలిచెను.

వృద్ధుఁడగుముసల్మానుఫకీరు వేగముగా బాదుషహావద్దకు వచ్చి వజ్రగంభీరస్వరముతో నానిశ్శబ్దసభాసదనముమారుమ్రోఁగునట్లుగా "వినుము! ఔరంగజీబుబాదుషా! వినుము! మూర్ఖతకును మేరయున్నది. అదూరదర్శిత్వమునకును బరిణామమున్నది. ఈవీరయువకునిరక్తబిందువొక్కటి భూమిపైఁ బడినతత్క్షణమే నీతల తెగినమొండెము నేల నాలింగనము చేసికొనునని నిశ్చయముగాఁ దెలిసికొనుము" అనియెను.

బాదుషా మహాగ్రుఁడై యాఫకీరుంగాంచుచు "ఛీ! యున్మత్తఫకీరా! నేను భారతవర్షసమ్రాట్టును" అనియెను.

ఫకీరు తీవ్రకటాక్షముతో బాదుషహాముఖమండలమును దృష్టించి చూచి యాతనికన్నుల కెదురుగఁ జేతివ్రేళ్ళచే నొకటి రెండుసారులు సంజ్ఞచేసి "నీవేసార్వభౌముఁడవా? పైకొకసారి కనుదెఱచి చూడుము. సమ్రాట్టెవ్వరు?" అనియెను.

బాదుషా మంత్రాహతునివలెఁ దలయెత్తిచూచి కన్నులను దెఱచి రెప్పపాటులేనిదృష్టితోఁ దనతలపైనున్నయాకాశమును జూచుచుండెను. మంత్రబలమో కాక మెస్మరిజమో మేము చెప్పఁజాలము. ఔరంగజీబు పైకే చూచుచుండెను. ద్వాదశచంద్రకిరణములచే దిఙ్మండలము వెలుంగ గౌరమయమైనదివ్యకాంతితో, రత్నఖచితకిరీటముతో శోభించుచు

న్నయగ్బరుసార్వభౌముఁడు జ్యోతిర్మయస్వర్గవిమానమునఁగూరుచుండియుండెను. విమానమునకు నలువైపులఁ బ్రఫుల్ల వదనులుఁ బులకితనేత్రులు నగునసంఖ్యాదేవతలు చుట్టుకొనియుండిరి. ఔరంగజేబు మహాశ్చర్యదృష్టులతోను,గలఁతవాఱినప్రాణములతోను, శూన్యవీక్షణములతోను, నారాజరాజేశ్వరమూర్తిని జూచిచూచి, క్రిమ్మఱఁదనసభామండపమువైపునకు దృష్టిని మరల్చి చూచెను. ఏమిచూచెను? చిరత్నరత్నరాజిచేఁ బ్రదీప్తవజ్రమాలికలచేఁ బ్రకాశించుచున్నయావింతదర్బారు భయంకరఘోరాంధకారమున మునిఁగిపోయెను. మఱియు నాయంధకారమధ్యమున నగ్నదేహులును భయంకర వదనులును వికటదంష్ట్రలును నగుదానవు లట్టహాసము గావించుచుఁ గోలాహలము చేయుచుండిరి. మరలనదేమి! ఎదుట నాకాశమునుండి పడినచంద్రునివలె ధూళిలోఁ బడి దొరలుచున్న దివ్యకాంతిసమన్వితుఁడును దండ్రియు నగు షాజహాను బంగారుసంకెలలతో నాబద్ధుఁడై యుండెను. సమీపమునఁ బెద్దన్నయగు "దారా" వీరమూర్తి శూలారోపితమై యుండెను. ప్రేమాస్పదుఁడగుతమ్ముఁడు షుజానుచ్ఛిన్నముండము శూన్యాకాశమున వ్రేలాడుచుండెను. ప్రియదర్శనుఁడైనతమ్ముఁడు "మురాద్" రక్తమయశరీరము ధరాతలమునఁ బడి పొరలాడుచుండెను. సమ్రాట్టు కెవ్వునఁ గేకవైచి కంపిత కళేబరముతో సింహాసనమునుండిలేచి నిలిచెను. ఉమ్రావులు చూచి యతనికడకుఁ బరుగెత్తుకొని వచ్చిరి. పాదుషహాకు

జబ్బుగా నున్నదని వైద్యులను దోడ్కొని వచ్చుటకు జనులు దశదిశలం బరువెత్తఁజొచ్చిరి. కొందఱాతనిబట్టుకొని విశ్రాంతిభవనమునకుఁ గొంపోయిరి. దర్బారుముగిసెను.

---

## ఎనిమిదవప్రకరణము.

సాయంకాల మైనపిమ్మట ఫాదుషహా విశ్రాంతిభవనమున నేకాంతముగాఁ దిరుగుచుండెను. సమీపమున "నఫ్జుల్ ఖాను" చేతులు ముకుళించుకొని నిల్వఁబడియెను. ఫాదుషహా యాతనిం జూచి "సేనాపతీ! శత్రువు లిద్దఱుకును దండవిధానము కాలేదని నీవు మనస్సులోఁ జింతించుచుంటివి గాఁబోలును." అనియెను.

అఫ్—వారిపైఁ దమకృపాకటాక్షములు ప్రసరించినపిమ్మట వారు శత్రువు లెట్లగుదురు? కాని, వారిద్దఱును రాజశాసననియమములకువిరుద్ధముగా సంచరించుచున్నారు. ఉమ్రావులకును, ఉద్యోగస్థులకును విరోధముగా సంచరింపఁగూడదని భావించి నేనే కారాగారమునకుఁ బోయి వారిని విడుదలఁ గావించితిని.

అఫ్జుల్ ఖానుని సమాప్తుడువదనమండలము గంభీరభావమును ధరించియుండుట నెఱుంగక నిట్లూర్పు విడుచుచు "ఆయిర్వురియదృష్టము నింతయుంచిదని నేనెన్న కొనలేదు" అనియెను.

ఔరం—జరిగిపోయినదానికి వ్యసనపడిన నేమిలాభము? నేఁడావృద్ధఫకీరుని జూచినపిమ్మట నీకెట్టియభిప్రాయము గల్గియున్నదో చెప్పుము.

అఫ్—ఆతఁడు పిచ్చివాఁడు; పాషండుఁడు; కాఫరుఁడు; నరాధముఁడు!

ఔరం—మేమిప్పుడు నూతనరాజనీతి ననుసరించి రాజ్యప్రవృత్తుల మగుట యనర్థకమయినదని వృద్ధఫకీ రెఱుంగుటయేకాక, అగ్బరుపాదుషహా యేర్పాటుచేసి ప్రచారమునకుఁ దెచ్చినరాజనీతియే మొగలుసామ్రాజ్యమునకు శ్రేయస్కరమైనదని చెప్పుచున్నాఁడు.

అఫ్జుల్ ఖాన—ఆపిచ్చివాఁడేమి చెప్పఁజాలఁడు? ఏమి తెలిసికొనఁజాలఁడు? కాఫరెప్పుడైన ముసల్మానులను బ్రశంసించునా? గుడ్లగూబ యెన్నఁడైన వెలుఁగును మెచ్చుకొనునా?

ఔర—అయినచోఁ బూర్వము ప్రచారమునందుండెడిరాజనీతినిబంధనములకంటె మేమిప్పు డేర్పాటుగావించినవే సర్వోత్తమము లనుటకు మీమనస్సుల నెట్టిసందేహము లేదుగదా?

ఇచ్చకములాడి, ముఖస్తుతులు చేసి యుబ్బించుస్వభావముగల "యఫ్జుల్"చేతులు జోడించుకొని "జహాపనా! ఆవిషయమున దేవర యీపాదసేవకుని మరలఁ బ్రశ్నించుట యేమిటికు? తమవంటి రాజనీతిజ్ఞులు జగమున నెవ్వరున్నారు? అగ్బరుషహా వారియవ్యవస్థవలనఁ గాఫరునకుఁ గన్నులు నెత్తి

కెక్కినవి. ఇదివఱకు నిది ముసల్మానురాజ్యమని యెవ్వరు నను కొనుటలేదు. ఇంతకాలమునకు ముసల్మానవంశమునకు సూర్యతేజులైనయలంగీరుఫాదుషహావా రవతరించుటచే నంధకారము వోయి "ఖురాన్ షరీఫ్" యొక్క వెలుఁగు జగత్తునందంతటను బ్రకాశించుచున్నది! మీబాహుశక్తిచేత హిమాలయమునుండి కన్యాకుమారికాగ్రపర్యంతముఁగల రాజులందఱు దేవరవారికిఁ బాదాక్రాంతులై యున్నారు. మీయఖండపరాక్రమము విని రాజపుత్రస్థానమునందును మహారాష్ట్రదేశమునందును గలదుర్ధర్షహిందూరాక్షసులందఱును భయవిషాదములచే జీవచ్ఛవములై యున్నారు. మీయమానుషధర్మబలముచేఁ గోటికోటిహిందువులు ముసల్మానులకుఁ బాదాక్రాంతులై పడియున్నారు. మఱియు—

ఔరం—మఱియునా? బలమగు నొక్కపదాఘాతము చే,స్తుతిపాఠకుఁ డగునఫ్జుల్ ఖాను ప్రక్కయెముకలను జూర్ణముచేయఁగలను.

ఫాదుషహా అఫ్జుల్ ఖానునిగుండెలపైఁ గాలూని బలముగా నేల కంటఁద్రొక్కి పట్టి "నోరెత్తకు గులామా! నీవంటి ముఖస్తుతిపరాయణులగువంచకులదురాలోచనలలోఁ జిక్కి కొని మొగల్ సామ్రాజ్యము పాడై పాతాళమునకుఁ బోయినది. నేను రాజనీతిజ్ఞుఁడనా? అందుచేతనేనా యిరువదికోట్లభారతప్రజలు నాహృదయకర్తమును బానము చేయుట కాతురులై

యెదురుచూచుచున్నారు? నేను మూర్ఖులలో మూర్ఖుఁడను. అందువలననే భయప్రదర్శనముచేతను ఖడ్గసంచాలనముచేతను, ఈయిరువదికోట్లప్రజలను స్వాధీనమునం దుంచుకొనవలెనని యోచించితిని—నేను నరాధముఁడను. నేను మూర్ఖుఁడను—అందువలననే లోకకంటకుఁడనై లోకోత్తరమగు ప్రాచీనరాజవంశమునఁ బుట్టినయీమహారథులను సేవక "గులాము"జాతియందుఁజేర్పవలయు ననియాశపడుచున్నాను. వాలుకాసేతువున వారిధి దాటఁగోరుచున్నాను. నాకు విశేషబల మున్నదా? నాచేతితోనే నాబలబాహువును ఖండించి దూరముగాఁ బాఱవైచితినే. పూర్ణధర్మావతారుఁడనా నేను? స్తుతిపాఠకుఁడా! మిథ్యావాది! అందువలననేనా యీవిశాల రాజ్యమునఁ జెవులు చిల్లులుపడఁ జేయునాహాకారరవములుద్భవించినవి! అందువలననేనా నాప్రియతమసోదరులగు "దారా, సుజా,మురా"దులరక్తముచేతను, బరమారాధ్యుఁడగుతండ్రి కన్నీటిచేతను, బవిత్రప్రాణులగు హిందూవీరులహృదయరక్తముచేతను నాయీదురాకాంక్షయనెడిదానవ యజ్ఞాగ్నిని బ్రజ్వరిల్లఁజేసితిని!" అనియెను.

భారతసార్వభౌముఁ డశ్రులోచనుఁడై యాకాశము వంకఁ జూచుచు మరల నిట్లు చెప్పఁదొడఁగెను. "రాజకుల గురుస్వరూపుఁడ వగునోయగ్బరుసార్వభౌమా! నీదివ్యచక్షువులచే నొకమాఱు తిలకింపుము. నీవంశమునకుఁ గులాంగారుఁ

డును, నీచాశయుఁడునైపుట్టిన యౌరంగజీబు మూర్ఖతచే బంగారువంటిభారతవర్షము భస్మమైపోయినది. నీప్రియరాజ్యము పాపసాగరమున మునిఁగిపోయినది. మర్త్యలోకమున నీవు ప్రతిష్ఠించినయానందమయనందనవనమును బిశాచస్వరూపుఁ డగునౌరంగజీ బిప్పుడు హాహాకారమయఘోరారణ్యముగా మార్చివైచినాఁడు."

ఔరంగజీబు మందిరమున నిటునటు వేగముగఁ దిరుగుచు మరలఁ జెప్పఁదొడఁగెను. "లేదు, లేదు. ఇఁక నవకాశము లేదు. ఈప్రేతయజ్ఞప్రచండాగ్ని యిఁక నారిపోవునా? త్రికాలదర్శివి, గురుస్వరూపుఁడవు నగునోఫకీరా! నీవు కేవల మనుజమాత్రుఁడవు గావని తెలిసికొనినాను. నీవు సాక్షాన్మహమ్మద్దేవునిప్రత్యక్షదూతవై రాక్షసుఁడగునీయౌరంగజీబుధర్మము నగ్గుచేయుటకు స్వర్గమునుండిదిగివచ్చి యిప్పుడిప్రదర్శనమును గావించితివి. కాని, దేవా! ఇప్పటికి ముప్పదివత్సరములకుఁబూర్వమే యొక్కసారి దయచేసి యీపిశాచమునకు దర్శన మెందుల కీయవైతివి? నాకిప్పు డవకాశములేదు. ఈ ప్రచండాగ్నిశిఖలను జల్లార్చుపని నాయత్నమునకు మీరిపోయినది. ఈయగ్ని భరతవర్షమును భస్మము చేయకుండ నారిపోవునది కాదు. ఇఁక నవకాశము లేదు. లెమ్ముగులామా!"

పాదుషహా మరల నఫ్జుల్ ఖానుని కాలిచేఁ దొక్కిపట్టియిట్లనెను. "లెమ్ముగులామా! లెమ్ము, లెమ్ము. రాక్షసస

మాౘట్టునకు నీవు రాక్షసానుచరుఁడవు. ప్రీతియజ్ఞమునకుఁ బూర్ణాహుతినిచ్చి పూర్తి చేయుము. అదిగో వినుము; దూరము నుండి హిందువుల ఘోరగర్జనములు గగనము నంటుచున్నవి. మహారాష్ట్రుల భీషణకోలాహలమును, మేఘగర్జారవసదృశం బగు రాజపుత్రుల హుంకారరవమును నిరస్తముగాపించుటకుఁ బ్రియత్నించి చూతము. బయలుదేఱుము. కాఫరులరక్తప్రవాహమునందు ముసల్మానుజాతినొకలను వసపింతము. తుద కెట్లయినఁ గానిమ్ము—చరిత్రిగ్రంథములయందు రక్తాక్షరముల తో నౌరంగజిబునామము లిఖింపఁబడును. యుగయుగాంతరములందును నితిహాసకులు కన్నీరు గార్చుచు నలంగీరుపాము మహా నిష్ఠురరాక్షసలీల లభివర్ణింపఁగలరు" అనియెన.

---

తొమ్మిదవ ప్రకరణము.

సాయంకాలమునకు ముందు కృషికయువకుఁడు, ఆగావళిపర్వతపాదమూలమున నొంటరిగఁ గూరుచుండి చింతానిమగ్నుఁడై యుండెను. లాహోరుసేనాపతి మున్నాదాసు పర్వతముపై సమప్రదేశమున నుండునని వినియున్నాఁడు. కాని,అతని కక్కడకుఁ బోవుమార్గము తెలియదు. ఇంచుకసేపటిలో నొకయశ్వారోహకుఁడు తనసమీపమునకు వచ్చుచుండుటను జూచెను. ఆయశ్వారోహకుఁడు పాట పాడుకొనుచు వచ్చు

చుండెను. మర్గమునకుఁ బోవుమార్గము నడిగి తెలిసికొనుటకు యువకుఁ డాయశ్వారోహకున కెదురుగాఁ బోయెను. ఆగంతుకుఁడు నగుమొగముతో “నేను నిన్నే వెదకుకొనుచు వచ్చుచుంటిని. నీవు పాదుషాచెఱసాలనుండి విడుదలనొంది యిక్కడకు వచ్చుచుంటివని యీవఱకే తెలిసికొంటిని. నీవు నన్ను గుర్తింపలేదని తోఁచుచున్నది. నీవించుకసే పిక్కడనే యుండుము. ఇప్పుడే తిరిగి వచ్చెదను.” అనెను.

కృషికుఁడు చూచుచుండఁగనే యాగంతుకుఁ డించుక దూర మేఁగి తనయుడుపులను మార్చుకొనుటకై ప్రయత్నించెను. ఆతనిసైనికవేషము పోయి నారీవస్త్రము గోచరమయ్యెను. ఇనుపకవచము పోయి జిలుఁగుకంచుకమును ముక్తాహారమును గానవచ్చెను. కటిబంధమునుండి కత్తి పోయి కాంచీభూషణము గానవచ్చుచుండెను. తలపై నుష్ణీషము దీయఁగానే కేశకలాపము బయల్వడి చంద్రవదనమును, నీలోత్పలనయనయుగళమును, ఉన్నతవక్షమును జుట్టుకొని వెనుకవైపునుండి యడుగుఁదమ్ముల నంటుచుండెను; ఆహా! ఎంత చిత్రము! ఆసాంద్రనీలమేఘముపై నున్నయాపూర్ణచంద్రుని కృషికుఁడు మఱియొకసారి సందర్శింపఁగలిగెను. స్వప్నమునఁ గాంచినస్వర్గలోకరమణియు, నిర్జనసమప్రదేశమందును, గాళిందీనదీతీరమునందును సాక్షాత్కరించినసౌందర్యరాశియు నిదియే కాదా? అవును: ఆమోహినీమూర్తియే!

రమణియుఁ దనయెదుట నున్న శాల్మలీవృక్షసమున్నత శాఖపైకి లీలామాత్రముగా నెక్కి తనపైనికవస్త్రములనా కొమ్మకుఁ గట్టి చెట్టునుండి దిగి కృషికకుమారునివద్దకు వచ్చి నవ్వుచు నవ్వుచు "నిప్పుడు నన్ను గుర్తింపఁగలవా? చెప్పుము చూతము! నేనెవ్వరినో" అనియెను.

కృషికయువకుఁడు—నీవు సురలోకసుందరివే!

రమణియు నోటికిఁ జెఱఁగు మాటుచేసికొని నవ్వుచు "స్వర్లోకసుందరినే. కాని, యీపాడు మొగమునందు నీవు సురసుందరీలక్షణము లేమి కనిపెట్టితివి?" అనియెను.

కృషికుఁడు ప్రత్యుత్తర మీయకుండుటను జూచి "నీవి ప్పుడనినట్లు నన్నెప్పుడును బిలువకుము. విలాసకుమారి యని నన్నుఁ బిలుచుచుండుము. నేను చిన్నప్పటినుండియు మంచివస్తువులను గన్నప్పుడెల్ల నలంకరించుకొనుటకే యాసపడుచుండెడి దానను. అందువలన నాతండ్రి నన్ను విలాసకుమారి యని పిలుచుచుండెడివాఁడు" అని చెప్పి రమణి తనచీరను జూచుకొని మెల్లఁగానవ్వుచు "నీయవస్థయందును నీవయసునందును గూడ నాకలంకారములమీఁదనే యాశ. దానికేమి—ఇక్కడ నీవొంటరిగాఁ గూరుచుండి యేమి యోజించుచుంటివి?" అని యడిగెను.

కృషి—రాథోరుసేనాపతి దుర్గాదాసు పర్వతశిఖరము నందు వాసము చేయుచున్నాఁడని యెఱుంగుదును. కాని,

యేస్థలమునం దున్నాఁడో, యెక్కడ కేఁగి పోవలయునో యెఱుంగను.

రమ—దుర్గాదాసుకడకుఁ బిలుచుకొని పోవుటకే నిన్ను వెదకుకొనుచు వచ్చితిని. ఆతఁడు పర్వతదుర్గము నందున్నాఁడు రమ్ము! అచ్చటి కేఁగుదము. కాని నీవక్కడ రాజకుమారినిఁగూడ నంబాలికను జూడఁజాలవు.

కృషి—(చకితుఁడై) అట్లయినచో రాకుమారి యెక్కడ నున్నది? ఆమె రాథోరుసేనాపతిదుర్గమునందు నరుంధతీదేవితో నుండుట లేదా? ఆమె యిపు డెచ్చటి కేఁగినది?

రమ—(నవ్వి) ఎందుకు? రాజకుమారితో నీకేమిపని యున్నది? నీవు వీరుఁడవు—యోధుఁడవు—ఆమె యబల, స్త్రీ, నీవు దరిద్రకృషికుఁడవు—ఆమె రాజనందిని.

రమణి యిట్లుచెప్పుచుండఁగా నామెహాసప్రఫుల్లవదన మండలము గంభీరభావమును దాల్చెను. మరల నామె యిట్లు చెప్పఁదొడఁగెను. "నీవామెను బ్రేమించుచుంటివని నేనెఱుంగుదును. కాని, యిది ప్రేమించుటకుఁ దగినసమయమా? చెప్పుము. నీకు స్వర్గమునకంటెను మేలైననీభారతభూమి యవనపదదళితమగుచున్నప్పుడు నీహృదయము ప్రేమార్ద్రమగుచున్నదా? నీవు క్షత్రియవీరుఁడవు గావా? నీకు నలుదెసలఁబిశాచములచేఁ ద్రొక్కఁబడుచున్న యార్యుల హాహాకారధ్వనులు వినఁబడుచుండ నీమనసు రమణీదర్శనమున కాసపడుచున్నదా?"

కృషి—రాజకుమారి యంబాలిక యెక్కడ నున్నది?

రమణి మరల నవ్వెను. ఆమెగంభీరభావ మానవ్యా లో మరల నదృశ్యమైపోయెను. నీలతరంగిణిలోని నల్లనిగాంభీర్యచ్ఛాయ సురభిళపవనస్పర్శమునఁగల్గినయలలలో మరలఁగలిసిపోయెను. విలాసకుమారి నవ్వి "మరల నదేమాటయా? నేను కొన్నినాళ్ళనుండి దుర్గాదాసుదుర్గమున నివసించుచుంటిని. అంబాలికవలన నీసమాచార మాత్రయుఁ దెలిసికొని యుంటిని. కాని, యిప్పుడీవిపత్కాలమునందు నీవు వనితాగత ప్రాణుఁడవైనచో యుద్ధముచేయువా రెవ్వరు? సేనాపతి దుర్గమునకుఁ బోవుటకు ముందుగ నీవు నాకడ నొకప్రతిన సేయవలయును." అనియెను.

కృషి—ఏమిప్రతిజ్ఞ సేయవలయునో చెప్పఁగోరుచున్నాను.

రమ—యుద్ధము ముగియునందాకఁ ద్రికరణశుద్ధిగాఁ గేవలశత్రుసంహారమునందే మనస్సుంచెద ననియు శత్రుసంహార మైనఁగాని ప్రేమయందు మనస్సు చొరనీయననియుఁ బ్రతిజ్ఞ సేయవలయును.

కృషి—దేవి! అనేకదినములనుండి శత్రువధమహామంత్రమునందే దీక్షితుఁడనై యుంటిని. శరీరపతనపర్యంతము నామంత్రమునే సాధనచేయుదును.

రమ—అయినచో నడువుము. నిన్ను రాఠోరుసేనాపతి మాతృగృహమునకుఁ గొంపోయెదను.

ఇరువురును బర్వతసమప్రదేశమార్గమునుండి బయలు దేఱిరి. అంతటను నిశ్శబ్దముగా నుండెను. ఆకాశప్రాంతము నందుఁ జంద్రుఁడు నిశ్శబ్దముగా నవ్వుచు రమణీసుధాంశువద నమునందు సుధారాశిని బ్రవహింపఁజేయుచుండెను. కృషి కుఁడు సంపూర్ణదృష్టితో రమణీవదనము నవలోకించెను. పూర్ణచంద్రికిరణప్రసారమునఁ బ్రకాశించుచున్న యాసుందర రమణీవదనమండల మాకస్మికముగాఁ గృషికుని యంతరంగ మునదృశ్యాజ్ఞి, చిరకాలమునుండి నిద్రించుచున్న యతనిచిన్ననాఁటి జ్ఞప్తిని బయలుపఱిచెను. ఆతఁడు తనచిన్ననాఁ డొకప్పు డిట్టినిర్మలమైనవెన్నెలరాత్రియందు, ఈపోలికనున్న బాలికావ దనమును జూచినట్లు జ్ఞప్తికివచ్చెను. తోడనే కృషికయువకుఁడు చకితుఁడై "మిమ్మింతకుఁబూర్వ మెచ్చటనైన నేను చూచియుం టినా?" అని యడిగెను.

రమ—ఆఁనాఁడు నిర్జనప్రాంతమునందును, గాళిందీనదీ తీరమునందును జూచినసంగతి మఱచిపోయినట్లున్నది.

కృషి—అంతకుఁబూర్వము- అనేకదినములకు వెనుక, చిన్ననాఁడు మిమ్ముల నెక్కడనో చూచినట్లున్నది. ఎక్కడఁ జూచితినో జ్ఞప్తికివచ్చుటలేదు.

చంద్రికిరణములచేఁ బ్రకాశించుచున్నయారమణి రమ ణీయముఖమండల మప్పు డంధకారచ్ఛాయచే నల్లవడిపో

యెను. ఆమె క్షణకాల మూరకుండి "నీవు పొరపాటుపడుచున్నావు. నావంటినిర్భాగ్యురాలి నెవ్వరినో—దానికేమి యది యట్లుంచుము—ఎదుటఁజూడుము. రాఠోరుసేనాపతి రక్తపతాక గానవచ్చుచున్నది. నీప్రతిజ్ఞను మఱవకుము—మొదట యుద్ధము—పిమ్మటఁబ్రేమ" అనియెను.





శ్రీరాములు.

# అమరవిజయము.



## రెండవభాగము.



### మొదటిప్రకరణము.

విలాసకుమారి—అదిగో! వినుము; శంఖధ్వని వినుపించుచున్నది. దుర్గమధ్యమునందున్న మాతృమందిరములో మంగళారాత్రికము లారంభము లయ్యెను. వీరవరా! ఇక్కడ నించుక సేపాఁగుము. దూరమునందుండియే మంగళారాత్రికముల నారసి ప్రాణములఁ జల్లఁబఱచుకొని మఱియుఁ బోవుదము.

అది శంఖధ్వనియా? శంఖధ్వని యింతమధురమైనదా? శంఖధ్వనినుండి యిట్లు రాగాలాపనము సేయవచ్చునా? శంఖధ్వనినుండి యింతటియమృతముఁ ప్రవహించునా? శంఖధ్వని ప్రేమికునిచిత్తము నిట్లున్మత్తము గావించునా? అది వీణారవమైయుండనోపు! కాదు. వీణాతానమై యుండవలయును. వీణాతాన మింతగంభీరమైనదా? వీణారవము వీరుని

ప్రాణము నిట్లుపారవశ్యము నొందించునా? వీణాతాన మొక్కమాఱుగా నిట్లు సప్తమస్థానమునకుఁ బోవునా? వీణవిశ్లెచ్ఛించినచోఁ దంతి తెగిపోదా? అపూర్వమగు నాశంఖధ్వని కృషికుని దేహమందు రోమాంచితము గావించి, తరుణీహృదయతప్తరక్తమును నాళములనుండి ప్రబలవేగమునఁ బ్రవహింపఁజేసి యాకాశశూన్యహృదయమునందును, బర్వతవక్షమునందును, బ్రతిధ్వనిత మయ్యెను. ఆశంఖరవముతో సంగీతమునకు లీలానికేతనమై, జగత్తునకుఁ బ్రేమరసమును బ్రవహింపఁజేయునదై యొప్పుచున్న సుందరమనోజ్ఞ మధురకంఠస్వరము చేరియుండె నని యువకుఁ డెఱుంగఁడు.

క్రమముగా నావిశుద్ధశంఖధ్వానము కామినీకలంకర స్వరముచే జీవకళాస్ఫూర్తి నొంది భాషగాఁ బరిణమించెను. కృషికుఁడు చూచుచుండఁగనే పండ్రెండుగురు సుందరీమణులు శంఖములనూఁదుచు మందిరమునుండి బయటికి వచ్చిరి. వారి వెనుక ననేకనారీమణులు చేతులతోఁ జప్పటులఁ జఱచుచు, నోటితోఁ బాడుచు వచ్చి మందిరమున కెదుటనున్న విశాలాంగణమున నిలిచిరి. కొలఁది సేపటిలో వారిసంగీతము నిలిచిపోయెను. ఇంకను నదియేమి? ఆవినవచ్చునది నారీమణులసంగీత ప్రతిధ్వనియా, కాక దానికిఁ బ్రత్యుత్తరమా? అంగనలసంగీతము ముగియుటకుఁ బూర్వమే, భయంకరము, గంభీరము నగు భేరీరవముతోఁ గలిసి కరవాలముల ఝణఝణత్కారశబ్దముల

యందుఁబ్రతిధ్వనించుచు మఱియొక సంగీతధ్వని వినవచ్చెను. అమృతమయమగు కల్లోలినీప్రవాహకలకలధ్వని యాకస్మికముగా గభీరసముద్రగర్జారవంబుగాఁబరిణమించినట్లయ్యెను. కృషికయువకుఁ డాశ్చర్యముతోఁ జూచుచుండఁగా మందిరమునకు మఱియొక పార్శ్వమునుండి కాలమేఘస్వరూపులగు శతాధికవీరు లుజ్జ్వలకరవాలములఁద్రిప్పుచు ఘోరగంభీరగీతములఁ బాడుచు యుద్ధప్రాంగణమునందలిరణోన్మత్తులగువీరులవలె నృత్యములొనర్చుచు మందిరాంగణమునకు వచ్చిరి. కృషికుఁడు మాత్రముగ్ధునివలె నట్లే చూచుచుండెను.

—:పాట.—

కసపు చల్లఁగాఁగోటిబిడ్డలను ♦ గంటివిగదవే తల్లీ!
ఖడ్గకోటిచే శత్రుశిరంబుల ♦ ఖండించితివేతల్లీ!
అరికపాలములహారంబులునీ ♦ వఱుతఁదాల్తువేతల్లీ!
భరమగుదురమునసీకుఁజావనిన ♦ భయముతేదఁటే తల్లీ!
వదనసుధానిధి జలదాంతరమున ♦ వాఁడినదేమే తల్లీ!
ముదమునహాసజ్యోత్స్నలముజ్జగ ♦ ములనలరింపవె తల్లీ!
జయజయ! త్రింశత్కోటిదేవతల ♦ జన్మభూమిలేవమ్మా!
భయహారిణి!భాగ్యరాశి!పావని! ♦ భరతమాత! రావమ్మా!

వెన్నెలలో వెలుంగుచున్న శైలశృంగమునం దార్యవీరులు వీరపదఘట్టనంబుల నారావళీపర్వతములు ప్రకంపింపఁజేయుచు గంభీరసంగీతనినదంబులచే గగనతలంబుఁ బ్రతిధ్వని

పంజేయుచుం జ్యోమకరంగమున నృత్యము సేయుచూరంభించిరి. కత్తులను బైకెత్తి సంఘర్షణము గావించుచు "కదుపుచల్లంగా" అనిపాడందొడంగిరి.

కృషికుండుచూచి క్షిప్రహస్తముతోం గత్తి నొఱవెఱికి జ్ఞానశూన్యునివలెం బరువెత్తుకొనిపోయి మాతృమందిరమున జరుగుచున్న యామహోత్సవమునం జేరికొనియెను.

---

రెండవప్రకరణము.

---

హిందూవీరులు గిరిదుర్గమునుండి పోయి యువనశిబిరముల నాక్రమింపవలయును. కాని, దుర్గరక్షణమునకై నెవనిని నుంచి పోవలయును? దుర్గాదాసు వెంటనే నక్షిశాఖకము నకుం బోవలసియుండెను. దుర్గమునం దనేకరాజకుమారులుం గన లుండిరి. ఈవిపత్కాలమునందు, ఈయవనవిభ్రంభణసమయమునందు, ఈగురుతరభారమును వహించుటకుం దగినవీర శ్రేష్ఠుం డెవ్వండు? దుర్గాదాసునియభిప్రాయమున శూరవతీ రాజకుమారుం డగువిజయపాలుండీగౌరవపదమునకు యోగ్యుండుగా నుండెను. కాని, యాపదనియం దాతని నిల్పినచోం దక్కినరాజకుమారుల నవమానించున ట్లగును! విశేషించి విజయపాలునకు వంశగౌరవము వీరత్వము నున్నను, నాతండు జనసమాజనమున సన్మానభాజనుండై యుండలేదు. అతం

డసమసాహసికుఁడైనను జను లాతని సామాన్యముగా స్థాన శూన్యుఁడని భావించుచుండిరి. ఘనకార్యము నల్పకార్యము నాతనికి సమానములే. ఇంతియే కాక, ఆతఁ డపరిమితముగా నల్లమందును సేవించుచుండెను. అనేకు లాతని శుద్ధమూర్ఖుని గాఁ బరిహసించుచుందురు. మఱికొందఱతనిఁబిచ్చివానిగాఁబరి గణించి యుదాసీనభావమునఁ జూచుచుందురు. రమాఖలంద ఱు నాతనినివినీలదేహకాంతిని, లంబోదరమునుగూర్చి యనేక కుత్సితవినోదములు గావించుచుందురు. పిల్ల లాతనిని "నల్ల గొండా" యని పిలుచుచుందురఁట. ఈసందర్భమునఁ గర్తవ్య కార్యనిరూపణము గావించుట కిష్టముగాఁ దోఁచి దుర్గాదాసు రాజమహిషి యరుంధతీదేవివద్దకుఁబోయి స్థితిగతులు విన్నవిం చెను.

రాజకుమారి యు బాలికయు నచట నుండెను. రాజ మహిషి దుర్గాదాసునిఁ జూచి "సర్వశ్రేష్ఠుఁడైనవీరునిపై మారక్షణభారము నుంచుఁడు" అని పలికెను. కాని, శ్రేష్ఠవీ రుఁ డెవ్వఁడో నిర్ణయించుట యెట్లు?

ప్రభాతసమయమున, దుర్గమున కరకోసుదూరమున నది కవ్వలిభాగమున నొక శిబిరము స్థాపింపఁబడియెను. దుర్గమధ్యమున నున్నతశైలశృంగముపై రక్తవర్ణపతాక మె గురుచుండెను. శిబిరమునకు సమీపమున బహుజనులు గుంపుగూడిరి. ఎల్లరు నుత్సుకనయనములతో దూరమునందు

బర్వతశిఖరమునఁ బక్షివలెఁ గాలిలో నెగురుచున్న రక్తవర్ణ పతాకను జూచుచుండిరి. అందఱియెదుటను రాథోడసేనాపతి దుర్గాదాసు నిలిచియుండెను. దుర్గముపై నిలిచి రమణీమణులం దఱుఁ గౌతూహలముతో శిబిరమువంకఁ జూచుచుండిరి. విజయపాలుఁడశ్వారోహియై దుర్గాదాసున్నచోటికి వచ్చి యెల్లమందను సేవించుటచే నెఱ్ఱవాఱియున్న కన్నులతో నలువెసలఁ జూడఁదొడంగెను. దుర్గాదాసు గంభీరస్వరమున వీరశ్రేష్ఠులతో నిట్లనియెను-"వినుఁడు; రాజస్థానరాజవంశమునఁ బుట్టిన వీరాగ్రేసరులారా! నేను దుర్గమునందు లేనప్పుడు రమణీమణులను, రాజకుమారికలను, రాజమహిషిని సంరక్షించుభారము వీరశ్రేష్ఠుఁడగువిజయపాలునిపైఁ బెట్టి పోవలయునని భావించితిని. కాని యుద్ధకాంక్షేపణలుండుటచే మిమ్మందఱ నేఁటియీవీరపరీక్షకు రాఁగోరితిని. పర్వతశృంగముపైఁ గానఁబడుచున్న రక్తవర్ణపతాకను, అందఱికంటెముందు,రాజగు విజయపాలునికంటె ముందుగా నెవ్వరు స్వహస్తములతోఁ బట్టుకొందురో అట్టివా రీవీరపరీక్షయందు నందఱికంటె వీరశ్రేష్ఠులని పరిగణింపఁబడుదురు. కుమారవిజయపాలుఁడు దుర్గపాలనాధికారమునుండి తొలఁగింపఁబడును. మీలో నెవ్వరైనను వీరవిజయపాలునకుఁ బ్రతిద్వంద్వులై జయలాభమునుగోరువారున్నచో ముందఱికి రావచ్చును. అశ్వారోహకులై విజయపాలునితోఁ బోయి యెదుటనున్న పర్వతశృంగములను

దాఁటి, యడ్డముగాఁ బ్రవహించుచున్న నది నీఁదుకొనిపోయి యన్నిటికంటె నెత్తుగానున్న శైలశిఖరమున కెక్కి రక్తపతాకను బైకెత్తి చూపవలయును.

అతికష్టమును బ్రాణాపాయకరమునగు నంతటి శ్రమను సహించి కేవల శౌర్యప్రదర్శనమునకుమాత్రము ముందంజ వేయువా రెవ్వరు? ఎంతవలకున బెదరులేనియసమసాహసికుఁడగు విజయపాలుని నీయసామాన్యసాహసికకార్యమునం దోడించుట యసంభవము. ప్రయత్నము విఫలమైనచోఁ బరిహాసపాత్రులై స్త్రీలనగు బాలలకుఁ బాలుగావలసివచ్చును. అందువలన రాజవంశమువా రెవ్వరును ముందంజ వేయరైరి.

సర్గాదాసుఁడు, సేనాధిపతులును రాజకార్యోద్యోగులును నిలిచియున్న దిక్కునకుఁ జాల సేపటివఱకుఁ జూచెను. అందఱును మునుపటివలెనే కదలక మెదలక యుండిరి. అప్పుడు రాథోరు సేనాపతి యోర్పుతో నుండఁజాలక దుఃఖము చేతను, నభిమానముచేతను గర్జించుచుఁ గంపితస్వరమున నిట్లనియెను- "రాజపుత్రుఁడు శౌర్యప్రదర్శనమునకు భయపడి వెనుదీయునని నేనింతకుముందు దలఁచకొనలేదు. అయినను నాకింకను నాశ వదలలేదు. సమస్తసైన్యాధిపతులారా! వినుఁడు! దర్శకులారా! వినుఁడు! ముసలివారైనను, యువకులైనను, బాలకులైనను, నున్నతవంశమువారైనను, నీచవంశమువారైనను — అందఱు వినుఁడు! మీలో నెవ్వరినరములయందైన రాజపుత్ర

రక్త ముున్నచో ముందజేకీరంమ. లేనిచో నేంటిరాజపుత్రవీర మ పరిదర్శనమే యంత్యపరిదర్శనము కాంగలను. కోటివీరులకుం దల్లియైన రాజపుత్రస్థానముయొక్క పుత్రగౌరవ మొక్కవీరుని విజయమునందుం బర్యవసానముం బొందుచున్నది. చూడుండు! దూరమున, మాతృమందిరోన్నతశిఖరమునకుం బైభాగమున రక్తపతాకకుం బార్శ్వమునం దార్యమణిమాలలు విజయ మాలికను జేంబూని నిలిచియున్నారు"

దుర్గాదాసుమాట ముగియకుండంగనే నలుదెసలనుం డియుం గోలాహలముపరిబలి కరతాళధ్వనులు వినవచ్చెను. శిబిరమున కవ్వలిపార్శ్వమునుండి నూంగుమీసముల వాండును సుందరాంగుండు నగుబాలసైనికుం డొకండు నగుమొగముతో గుఱ్ఱమును బరుగెత్తించుకొనుచు వచ్చి యశ్వముపైనుండియే దుర్గాదాసున కభివందన మాచరించి,విజయపాలునిపార్శ్వమున నిలిచెను.

విజయపాలుండు సహాస్యవదనముగ సైనికు నాపాద మస్తకముం జూచి యాతనియశ్వమును విడుచుటకై కనుబొను లచే సంజ్ఞచేసెను. ఇరువురిగుఱ్ఱములును వేగముతో బయలువెడ లెను అపరిచితుం డగునాగంతుకునితో వెడలినవిజయపాలుం డోడిపోవుట యసంభవముకాదని చూపఱులూహించుకొను చుండిరి.ఏలన?ఆతనిగుఱ్ఱమువిజయపాలునిగుఱ్ఱమును ముందజేకిం బోకుండం దానించుకయు వెనుకవడకుండ దానికి వెంట

వెంట, గుట్టల నెక్కి మెట్టలపైఁ బరుగువాఱి వేగముగాఁబోవు చుండెను. కొలఁదిసేపటిలోనే యిరువురును గొండ నెక్కి మఱ్ఱ పార్శ్వమునం దున్న పతాకాస్థానమునకు దిగువనున్న శిఖరము వఱకును సమానముగాఁ బరుగెత్తిరి. అంతవఱకు నెవ్వరును వెనుకవడలేదు. అక్కడనుండి పైశిఖరము నెక్కుటచాలఁగష్ట ము. ఆయాసము నపనయించుకొనుటకు ందిరువురును నిలిచి గగ నతలమునం బెగురుచున్న ధ్వజపటమును జేరుట కతికష్టమైన యున్నతశిఖరమును నిరాశాసయనములతోఁ జూచుచుండిరి. వారిరువురు నొకరివంక నొకరు చూచుకొని గుఱ్ఱములను ముం దఱికి వదలిరి. కొంచెముదూర మేఁగి చూచునప్పటికి బైకిఁ బోవుట యసంభవముగాఁ గన్పట్టెను. గుఱ్ఱముముందఱికిఁబోయి నంతదూరమును మరల వెనుకకు జాఱి వచ్చుచుండెను. మాత్రమందిరము పైభాగమునుండి చూచుచున్న రమణీమ ణులు, ఆయిరువురువీరులదురవస్థను గని నవ్వుచుండిరి. క్రింద దూరమునందుండి దుర్గాదాసు కేకలువైచి చెప్పుచున్న మా టలు వారిరువురకును వినఁబడుటలేదు. కృపిఖుఁ డానిరర్థకప్ర యత్నమును విడువవలెనని యోచుచుండఁగా మందిరాగ్రభా గమునుండి యొకగులాబిపూవు వానిపైఁ బడియెను. కృపిఖుఁడు తలయెత్తి పైకిఁజూచెను. మందిరపుఁబైభాగమునం దొకపార్శ్వ మున నిలుచుండి విలాసకుమారి మోమును జెఱఁగుచే మూసి కొనినవ్వుచు శిఖరమున కుత్తరదిక్కును సంజ్ఞచేఁ జూపించెను. కృపిఖుఁడు శృంగమున కుత్తరదిశగాఁ బోయి చూడఁగా

నచ్చటినుండి పైకిఁబోవు టంతకఠినముగాఁ దోఁపలేదు. ఆతఁడు మనస్సునందే విలాసకుమారికి వందనము గావించి యామెకు సేపటిలోఁ బతాకవద్దకుఁ బోయెను. విజయపాలుఁడు తనమనమున, సైనికయువకుఁడు నిరాశఁజెంది చేతఁగాక మెల్లఁగా జరగి పోయెనని యనుకొనియెను. కాని, యాకస్మికముగా నలువైపులనుండియుఁ గోలాహలము వినఁబడి తలయెత్తి పైకిఁజూచెను. సైనికయువకుఁడు పతాకయొద్ద నిలిచియుండెను. విజయపాలుఁడభిమానముతోడను క్రోధమువలనను గుఱ్ఱమును జబుకుతోఁ గొట్టి కొండనెక్కించుటకై ప్రయత్నించెను. నరుల గోల యాయెను. పైనున్న సైనికయువకుఁడు "ఇదిగో చూడుఁడు. ధ్వజపటము నాచేతియందున్నది" అని కేకవేసెను.

విజయపాలునిగుఱ్ఱమునకుఁగాలుజాఱెను. స్థూలకాయుఁడగువిజయపాలుఁ డాత్మరక్షణమునుఁ గావించుకొనుటకు రెండు చేతులతో నొకరాతిపలకను బట్టుకొనియెను. నలువైపులనుండి కరతాళధ్వనులును, హాసకలకలారావములును బయలుదేరెను.

---

## మూఁడవప్రకరణము.

---

అరుణపతాకను గరమునందు నుంచుకొని తరుణసైనికుఁడు రమణీరత్నములకెదురుగాఁ బ్రఫుల్లవదనుఁడై నిల్వఁబడి

యెను. రాజకుమారి యైనయంబాలిక చేతియందు విజయ మాలిక యలరారుచుండెను. రాజమహిషియరుంధతి విజయ మాలికచే యువకుని సత్కరింపుమని సూచింపించెను. కృత్తిక యువకుఁడు రాజమహిషికభివందన మాచరించి నేలపై మోకాళ్ళ నూని చేతులుజోడించుకొని భక్తిభావముతో నమ్రతమయకిశోరమూర్తి కెదురుగా దూరమున నిలుచుండి తనహృదయమందిరమునఁ జిన్ననాఁటినుండియుఁ బ్రతిష్ఠింపఁబడియున్న యాదేవీమూర్తిని గన్నెత్తి చూచెను. అంబాలికయుఁ దక్కిన వారికంటె నించుకముందుగా నిలుచుండెను. సంశయముచేతనో సంతోషముచేతనో, లేకయాసచేతనో, లజ్జచేతనో, ఆనందము చేతనో, కాకయభిమానముచేతనో, యామెశరీరము రోమాంచితమై హృదయము కంపింపసాగెను. రాజమహిషి మాలికను వేయుమని మరల నామెను హెచ్చరించెను. అంబాలిక కృత్తిక యువకునిసమీపించి కంపితకరములతోఁ బుష్పమాలిక నెత్తి పట్టుకొనెను. ఆసమయమునఁ జూపఱలో నొక్కఁడు బిగ్గఱగా "ఆఁగుము, రాజకుమారీ! ఇంచుకాఁగుము" అని కేకవేసెను.

జసల్మీరురాజకుమారుఁడగు కేసరిసింహుఁడు, అందఱ కెదురుగా వచ్చి నిలిచి సగర్వముగా "రాజస్థానరాజవంశమునఁబుట్టినమహావీరులారా! రాజరమణీమణులారా! యవన దండయాత్రలకును, రాజ్యవిప్లవములకును లోనైయున్నయిట్టి సమయమునందును, స్వాతంత్ర్యముతోపాటుగా నమూల్య

ధనమైయున్న మనజాతిగౌరవమును రక్షించుకొనుటకే ప్రయత్నించుకొనుచుంటిమి గదా! అట్టిమనమిప్పుడు, కులశీలగోత్రము లెఱుంగఁబడని, యొకనీచవంశ బాలకునిపై రాజరమణీరక్షణభారముంచి పొపలసినగతి మనకుఁ గల్గెఁగదా! రాజాధిరాజగు జయసింహునితనయ యంబాలిక యొకదరిద్రకృషిక యువకుని కంఠమునఁ బుష్పమాలిక నలంకరించు మహోత్సవముఁ జూచుటకై మనమిప్పు డిక్కడకుఁ జేరియుంటిమా?" అనియెను.

విజయపాలుఁడు ముందఱికివచ్చి రాజకుమారి యంబాలికముఖమును జూచి నవ్వుచు "జయపుర రాజనందిని యీకృషిక యువకునికంఠమును బుష్పమాలికచే నలంకరించుట కంగీకరించినను—రమణీమంగళమాల యట్లుండనిమ్ము—రాజపుత్రవీరుఁ డెవ్వఁడైన నాదుల కాంక్షింపక యుండఁజాలఁడు." అనియెను.

క్రోధలజ్జాభిమానములచే రాజకుమారి పల్లవాధరము ప్రకంపమొందసాగెను; ముఖమండల మెఱ్ఱవాఱెను; కనుదమ్ముల నీరునిండెను. ఆమె సగర్వముగా రాజమహిషివంకకుఁ దిరిగి చూచెను. చూపరులలో నొకఁడు "రాజమహిషీ! రాజకుమారిని వెనుకకుఁ బిలువుము" అని కేక వేసెను.

రాజమహిషియు నీసందర్భమునఁ దానేమి చేయుటకును దోఁపక, తనప్రక్కనున్నవారివంక నొక్కతడవు చూచి, రాజకుమారికి వెనుదిరిగి రావలయునని సంజ్ఞచేసెను అప్పుడు

రాజకుమారి తొలిమియు ధైర్యమును, స్థైర్యమును దిన్నవిడనాడఁ దనమనోభావమును వెల్లడించుట కుద్యమించి మోమును పైకెత్తి వికసితనయనములతోఁ గంపితాధరముతో నలుదెసలఁ దిలకించెను. అప్పటికిని గృషికయువకుఁడా మోచరణప్రాంతమునందు నేలపై మోకాళ్ళనూని చేతులు జోడించుకొని యూర్ధ్వనయనుఁడై, సత్కారమును బొందునాశతో నెదురుచూచుచు, భక్తుఁడు పవిత్రమంత్రములచే దేవీప్రతిమకుఁ బ్రాణప్రతిష్ఠఁ గావించి పిమ్మట నామూర్తి కెదురుగా భక్తిభావముతో ముక్తి నొసంగుమని వేఁడుచున్నట్లు నిలిచియుండెను.

ఒకనదిలో నొకదోనెపైఁ గూర్చుండి పోవుచున్న బాలిక, ప్రియముతోఁ దనతలలో ధరించుకొనిన సుందరకుసుమము గాలిచే దూలి జలమునం బడి తరంగములపైఁ దేలి కొట్టుకొనిపోవుచున్నపుడాపువ్వు నాబాలిక యెట్లు చూచునో యట్లే, ప్రియకాంతు నీలోకమున విడిచి పరలోకమున కేఁగిన యొకయువతీమణి మరలఁ గొన్నినాళ్ళ కొకనాఁటిరాత్రి, ప్రాణశూన్యనివలెనీపాపపుమర్త్యలోకమున జీవించియున్న తనయౌవనకాలపుఁబ్రియుని స్వప్నమునందు సురసుందరీరూపమున నక్షత్రమువలెఁదోఁచి మాయమైపోయినప్పుడుదానిప్రియుఁడు కన్నులు విచ్చి యెట్లుచూచునో యట్లే, అంబాలికయు నిరాశానయనములతోఁ గృషికయువకుని బ్రీతితోఁ గటాక్షించి చంచలనేత్రములతో నలువైపులఁ గఠోరదృష్టులఁ బరగించుచుఁ జేతిలోనిపుష్పమాలికను జిదురుపలుగాఁ దుంచి పాఱ

వైచి చంచలచరణములతో జరజర దుర్గములోనికి నడచి పోయెను.

విజయపాలుఁడు బిగ్గఱగా నవ్వుచు జసల్ మీరు రాజకుమారుని జూచి, "రాజకుమారా! ఇప్పుడు తెలిసినదా? అంగవల నిఘంటువునందు దీనికే ప్రేమ యని యర్థము" అనియెను.

## నాలుగవప్రకరణము.

దుర్గరక్షణభారము విజయపాలుని కొసఁగబడియెను. కృషికయువకుఁడును నితరసైనికులవలెనే యాతనికి సహాయముగా నాతనియధీనముననుండునట్లు నియమింపఁబడియెను. అందులకాతఁడసమ్మతుఁడు గాలేదు. అవమానితుఁడ నైతినని యు ననుకొనలేదు; తాను సామాన్యసైనికుఁడగుటచేఁ దనకా గౌరవపదవి నొసంగఁజాలరని యాతఁడు మొదటనే యెఱుంగును.

మఱునాఁడు రాజపుత్రరాజులును, సైన్యాధిపతులును సైనికులును దమకనురూపములగువీరవేషములతో దర్పితులై వచ్చియుండిరి; దుర్గమునుండి బయలుదేఱుసమయమునఁ జేరియున్న వీరమండలమును దుర్గాదాసు కలయఁజూచెను. జసల్ మీరు రాజకుమారుఁ డగు కేసరసింహుఁడుమాత్రమక్కడకు రాలేదు.

కేసరిసింహుఁ డప్పుడు నిర్జనమైయున్న తనమందిరమున నొంటరిగాఁ గూరుచుండి చింతానిమగ్నుఁడై యుండెను; మర్గాదాసు తన్ను బిగ్గఱగాఁ బిలుచుచుండుట విని, లేచి మెల్ల మెల్లఁగా నంతఃపురమునఁ బ్రవేశించి యంబాలికశయనగృహద్వారమునకు వచ్చి నిలుచుండి యోచించుచుండెను. ఒకపరిచారిక యాతనిఁ గని గదినుండి యీవలికి వచ్చెను; ఆతఁ డామెను జూచి "అంబరరాజకుమారి యెక్కడ?" అని యడిగెను; పరిచారిక తనచేతివ్రేలిని గదివంకకుఁ జూపించెను.

రాజ—ఆమె యేమి చేయుచుండెను?

పరి—లోని కేఁగి తెలిసికొనుఁడు.

రాజకుమారుఁడు లోపలికిఁ బోయి చూచెను. అంబాలిక యొంటిగాఁ గూరుచుండి యసంపూర్ణమైన యొకచిత్రపటమును దూలికచేఁ బూర్తి చేయుచుండెను. రాజకుమారుఁడు లోనికి వచ్చుట యామె యెఱుంగదు. ఆతఁడు చప్పుడగునట్లడుగుల నిడుచు నడచెను. అయినను రాజకుమారి యనన్యమనస్కయై చిత్రపటమునే చూచుచుండెను. కేసరసింహుఁ డికఁ సహింపఁజాలక పరుషభావముతో "రాజకుమారీ!" అనిపిలిచెను.

రాజకుమారి చకితయై, నేలపైనున్న చిత్రపటము నెత్తికొని యాతనివైపునకుఁ దిరిగిచూచెను. అప్పుడాయువరాజు

"రాజనందినీ! ఏకాగ్రచిత్తముతోఁ గూరుచుండి యెవ్వరిచిత్రమును జిత్రించుచున్నావు?" అనియడిగెను.

రాజకుమారి లేచి నిలువఁబడి నేలపై దృష్టులను బఱపుచు "మీరిక్కడి కేల దయచేసితిరి?" అనియెను.

యువ—(మరల) ఎవ్వరిచిత్రమును వ్రాయుచున్నావు? నీచవంశజుఁడగు నాసైనికకృషికయువకుని చిత్తరువునా?

ఈసారి రాజకుమారిక తాలిమి తప్పిపోయెను. ఆమె లజ్జ యప్పుడు రోషాభిమానములుగాఁ బరిణమించెను. పూర్ణాయతలోచనయై యామె కేసరసింహుని జూచి "మీరూహించినది నిజమే. ఇది కృషికునిచిత్తరువే యగును. నేను చిరకాలమునుండి చిరప్రయత్నముచేసి, చిరపరిశ్రమచే నాతరుణసైనికవీరమూర్తిని జిత్రింపఁ బ్రయత్నించుచున్నాను.

యువ—ఛీ! రాజనందినీ! ఆపటమును జెఱచిపాఱవేయుము.

రాజకుమారి ముక్తాఫలములఁ బోలురదనములచేఁ బెదవులఁ గఱచుకొనుచుఁ జేతిలోని చిత్రపటమును వక్షమునఁ జేర్చికొని గద్గదస్వరముతో "లోకములో జనులు తమప్రియవస్తువు నోడిలో దాఁచికొందురు. చెఱచి పాఱవేయరు." అనియెను.

యువ—అట్లయిన నాయనుమానము సత్యమే. జనులు నీవిషయమునఁ బుట్టించినయపవాదము నిజమే.

అంబాలిక—రాజకుమారా! జనులు పుట్టించినయుప వాద మేమి?

యువ—అంబర రాజకుమారి యొక కృషికయువకుని జూచి విముగ్ధమైనదని చెప్పుకొనుచున్నారు.

అంబా—యువరాజా! వీరపురుషుని వీరత్వమునకు ముగ్ధయగుట క్షత్రియాంగనకు ధర్మముగాదా! ఇదినిందాపాత్రముగాదు. స్తుతిపాత్రము గదా? ఇప్పుడు తెలిసినది. నాఁడు కృషికసైనికునకు బహుమానముగాఁ బుష్పమాలిక నర్పించు సమయమున న న్నవమానించితివి. మఱియొకసారి యట్లు చేయుట కభిలషించుచుంటివా యేమి?

రాజకుమారి యభిమానముతోఁ గన్నీరు నించుచు నటనుండి వెడలిపోఁ బ్రయత్నించెను. కేసరసింహుఁ డామె కెదురేఁగి యడ్డునిలిచి "రాజకుమారీ! వినుము. నేను నీవద్దకువచ్చిన కారణ మింకను నీకుఁ దెలుపలేదు" అనెను.

అంబా—వేగముగాఁ జెప్పుఁడు.

యువ—నిన్ను నాకిచ్చి వివాహముచేయవలయునని యోధపుర రాజమహిషి యభిలషించుచుండె నని నీవెఱింగి యుండవచ్చును. మొదట నేను నిన్నుఁ గాంచినప్పు డామాట కంగీకరింపనైతిని. కాని నే నీదుర్గమునకు వచ్చి నీయలౌకిక సుధామధుర మూర్తిం గాంచిననాఁడే యున్మత్తుఁడనై యాత్రముతో రాజమహిషియొద్దకుఁ బోయి వెనుకటినీవివాహప

స్తావమునకు నానమ్మతిని దెల్పితిని. కాని నీవంగీక రింపలేదని వింటిని.

అంబ.—యువరాజా! జరగిపోయినపూర్వకథలతో ఫలమేమి? మీకు నన్నిచ్చి వివాహముసేయుట యసంభవ మని యనేకపర్యాయములు రాజమహిషివలన వినియున్నాను. నేను నల్లే యామెతో విన్నవించుకొనియున్నాను.

యువ.—రాజనందినీ! నిన్ను మఱియొకసారి కడసారి యడుగుట కిక్కడకు వచ్చియుంటిని. ఈజీవితమున నీయిరువ దిరెండువత్సరములకాలమును నాకెదురుపడు శత్రువులజయించుచింత దక్క యన్యచింత యెఱుగను. కాని నిన్నుజూచి నదిమొదలు నేను పిచ్చివాఁడనైతిని. అదిగో, చూడుము! దుర్గపార్శ్వమున వీరులందఱును యుద్ధమునకు బయలుదేఱ సిద్ధముగానుండి నాకొఱకెదురుచూచుచున్నారు. ఇప్పుడు చెప్పుము! అంబాలికా! నీవు నా పాణిగ్రహణమున కంగీక రించినచో నిరుపమానందమున నీవీరులతోఁ బోయి యుద్ధ మున సహాయము చేసెదను. నీవంగీకరింపనిచో నీవలకు నాహృదయమున నాటికొనియున్న. శత్రుసంహారదీక్షాలతను నాచేతులతో సమూలముగాఁ ద్రెంచివైచి యీజన్మమున వీర ధర్మమున కిప్పుడే తర్పణము వదలెదను. మఱియు—మఱి యు నని చెప్పను యువరాజు నోటమాటరాక యూరకుం డెను. అంబాలిక యభిమానముతో "మఱియునేమి" అనియెను.

యువ—నాహృదయమున నెలకొన్న పైశాచికప్రతిజ్ఞ నగూర్చి చెప్పుటకు నోరురాకున్నది. కాని, నే నున్మత్తుఁడను. ఉన్మత్తునకు మానావమానము లెక్కడ నుండును? ఉన్మత్తున కాత్మాభిమాన మెందులకు? అయినచో వినుము. రాజనందినీ! నాప్రతిజ్ఞను జెప్పుచున్నాను—నేఁడు మొదలొకసంవత్సరము లోపల నీవు యువరాజుతోడ పైఁ గూర్చుండియుండుటను జూచితీరుదును. నిన్ను—ఈకనకపారిజాతలతికను నందనకాననమునుండి నరకమునకుఁ దన్ని పాఱవైచెదను.

అప్పు డాయువరాజకేసరసింహుని వీరసుందమూర్తి యాకస్మికముగాఁ గాలభుజంగరూపమును దాల్చినను, అంబరజరాకుమారి యంతగా నాశ్చర్యపడలేదు. ఆమె యించుక భయాశ్చర్యములతో యువరాజు మోమును క్షణకాలము చూచి "ఛీ, క్షత్త్రియరాజకుమారా! స్వర్గధామమునఁ బిశాచము పుట్టునని స్వప్నమునందును ననుకొనలేదు. నేనుమరలఁ జెప్పుచున్నాను వినుము. నేను నిన్నుఁ బెండ్లియాడుట యసంభవము." అనియెను. కేసరసింహుఁడు ప్రత్యుత్తర మీయకుండఁగనే యచ్చోటు వదలి దుర్గాదాసువద్దకుఁ బోయి "నాకొఱకు నిరీక్షింపనక్కఱలేదు. మీరు బయలుదేఱవచ్చును. నాకు వేఱొకపని యున్నది" అనిచెప్పెను. కేసరసింహుఁడొంటరిగా నాఁటిసాయంకాలమే యవనసేనాపతియగు నఫ్‌జల్ ఖానువద్దకుఁబోయి యాతనికి వందనము గావించెను.

---

## అయిదవ ప్రకరణము.

మర్గాంతపురమునం దొకగదిలో నేఁడువత్సరముల యీడుగలబాలిక యొకతె కరతాళములఁ గావించుచు నిట్లు పాడుచుండెను.

"ప్రేమజలధిలో మునిఁగినవారలు ♦ భేదవాదముల నెంతురఁటే!
ప్రేమపదంబునఁగులశీలంబులు ♦ పెద్దతనంబులు నిలుచునఁటే!"

అక్కడనున్న కొందఱంగన లాగీతమును విని నవ్వసాగిరి. వారిలో నొకతె పరుగెత్తుకొనిపోయి యాబాలికనోరు తనచేతితో మూసి "ఓసిపాడుముండా! ఊరకుండవే. ఆబాలిక విన్నచో ననర్థక మగును" అనియెను.

ఆబాలిక గదిలో నొకపార్శ్వమున గవాక్షమునొద్ద నిలుచుండి గీతము నాలకించుచుండెనని లోపలనున్న వారెఱుంగరు. ఆమె విలాసకుమారితో నాగదికి వచ్చుచున్నప్పు డాగీతమును విని "విలాసకుమారీ! నీవు నమ్మవేమో, వినుము. ఆసంగీతము నన్నుఁగూర్చియే పాడుచున్నట్లున్నది. ఇక్కడ నిలుచుండి యించుక వినరాదా? ఇంకను నెంతయో పరిహాసముండియుండవచ్చును. రాజమహిషి కృషీకునకుఁ బుష్పమాల నర్పింప నాజ్ఞయిచ్చినదిమొదలు నన్నుఁగూర్చి యిట్టిహాస్య పరిహాస్యములు జరుగుచున్నవి". అనియెను.

నిలా—నీ వా యన్నిటికి నట్టియభిప్రాయముతోఁ జెవి యొగ్గ నేల? మనమును నచ్చటికే పోయి యది విందము నమవుము.

అంబ—వలదు, నాతోడు! మనమక్కడకుఁ బోవల దు. మఱి కొంచెము సేపాఁగి విందము.

గదిలోని బాలిక పెద్దవారిగద్దింపులకు వెఱచి పాటమాని వేసెను. కాని, యచ్చట నాఁడువాండ్రప్రసంగములు మాత్రము జరిగిపోవుచునే యుండెను. వారిలో నొక తె "అక్కా! సరేగాని, అది పిల్లగనుక దానినోరు మూసితివి గాని యూరందఱినోరును మూయఁగలవఁటే;" అనియెను.

మఱియొక తె—అబద్ధము కాదు. అది యందఱుఁ జెప్పు కొనుచున్న మాటయే.

ఇంకొక తె—ఎవ్వరినిగూర్చి? నేను వినఁగూడదా యేమి?

మఱియొ—అంబాలిక ప్రేమమునుగూర్చినమాటయే.

ఇంకొక తె—ఆ ప్రేమ యెవరిమీఁద?

మఱియొక తె—ఆతియ్యతియ్యనిమాటలు, ఆచక్కనికన్నులు, ఆ మేలిమిబంగారురంగు గల ఆకృషికకుమారుని మీఁద.

అప్పుడందఱును "పకపక" నవ్వ నారంభించిరి. అందు వలన బాలిక యుత్సాహ మతిశయించి యూమెమరలఁ బాడ నారంభించెను.

"విష్ణుపదంబున వెలసిన జాహ్నవి ♦ విపథగామి గాలేదఁట వే
వీరకన్యయగు రుక్మిణి గోర్కిని ♦ విభునిగఁ జేకొనలేదఁట వే"

అంబాలిక కన్నీరు గార్చుచు విలాసకుమారిం జూచి "వింటి వా? నేను చెప్పినమాట యసత్యమో నిజమో నీవే చెప్పుము." అనుచు విలాసకుమారిచేయి పట్టుకొని దూరముగా నున్న యొక నిర్జనమందిరమున కామెను గొనిపోయి "సఖీ! ఇటు కూర్చుండుము; నీతో నేకాంతముగా నొకసంగతి చెప్పవలసి యున్నది" అనియెను.

విలా—కోపము పోయినదా ?

అంబా—పోనీ నీవే చెప్పుము. అంగజు నిట్టిమాట లాడుచున్నచో నెవ్వారికిఁ గోపమురాదు?

విలా—(నవ్వి) ప్రేమను బొందించుకొనవలసినచో వానినన్నిటిని సహించుకొనవలయును.

అంబ—(కన్నులనీరునిండ) సఖీ! నీవును నన్ను హాస్య మాడుచున్నావా? నాయదృష్టమును; నేను నీతోఁ జెప్పుకొనవ లసిన దొకమాట యున్నది. నీతోఁగాక యింకెవరితోఁ జెప్పు కొనను ? నిన్నుఁ జూచినదిమొదలు నీపై నాకు సోదరీప్రేమ గల్గినది. నీ వొకసారి సైనికయువకునికడ కేఁగి "నామీఁద దయ యుంచి, యీదుర్గమును విడిచిపోవుటకు వేఁడికొనుచున్నా" నని యాతనితోఁ జెప్పుము. మఱియు—

## ద్వితీయభాగము.

ఆకస్మికముగా రాజకుమారి విశాలనయనములు భేదించుకొని యశ్రుధారలు ప్రవహింపఁజొచ్చెను. మరల నామె చెప్పఁదొడంగెను. "నాది మఱియొక భిక్ష—ఈజన్మమున మరల నాతఁడు నన్నుఁ జూడవలదనియు నాతనితోఁ జెప్పుము"

ఇట్లు చెప్పుచు నం బాలిక విలాసకుమారికంఠమును గౌఁగిలించుకొని యామె యెదపైఁ దన మోమువాల్చి వెక్కి వెక్కి యేడువ నారంభించెను. విలాసకుమారి తనచీర చెఱఁగుతో నామె కన్నులఁదుడుచుచు "నాతని మఱచిపోవుట శక్యమా?" అని యెను.

రాజకుమారి దర్పముతోఁ దలయెత్తి చూచి "సఖి! ఏమంటివి? మఱచిపోవుట శక్యమా? అట్లయినఁజెప్పెద వినుము. నీకు మొదటినుండియుఁ జెప్పెదను. నేఁటికిఁ బదివత్సరములకుఁబూర్వము—మాయమ్మ స్వర్గస్థురాలగుటకు ముందు—మీవారు మహారాజును దర్శించుట కేఁగెను. ఆనాఁడు "రాజసముద్రతీరమునందు విరియఁబూచినయశోకవృక్షము క్రింద నొకసారి—ఒకసారి మాత్రమే—యాతనిఁజూచియుంటిని. అప్పుడు నేను—ఇదేమిసఖి?"—అని యెను.

విలాసకుమారి తనకంఠమునకుఁ జుట్టుకొనియున్నయం బాలిక చేతుల నాకస్మికముగా విడిపించివైచి లేచి నిల్చఁబడియెను. అం బాలికయు నామె యెఱ్ఱవాఱిన మోమును జూచి "ఇదేమి సఖి! నామీఁదఁగోపము వచ్చినదా? లేక విసుఁగుగా నున్నదా? అసహ్యమా?" అని యడిగెను.

విలాసకుమారి మరల నంబాలిక నాలింగనముచేసి కొని "రాజనందినీ! మన్నింపుము! అనేకదినములనుండి నాహృదయమున శోకవ్యాధి సంభవించెను. ఆకస్మికముగా హృదయమునం దొకజ్వాల బయలుదేఱి యించుక సేపు ప్రజ్వరిల్లి పిమ్మట నుపశమించుచుండును. కాని, యిట్లు కాకుండఁజూచుకొనియెదను-నీవు చెప్పవలసినదానిని జెప్పుము. రాజసముద్రసరోవరతీరమున నీవాతని నొకసారి చూచి యుంటివి. పిమ్మట నేమిజరిగినది?" అనియడిగెను.

అంబాలిక విలాసకుమారిముఖమును జూచి క్షణకాల మూరకుండి మరలఁ జెప్పఁదొడఁగెను——"హాసఖీ! అప్పుడు నేను బాలికను. ప్రేమయన నాకేమి తెలియును? కాని యదిమొదలుకొని పవలును రాత్రియు, జాగరణమునందును స్వప్నమునందు నాతరుణారుణమూర్తిని హృదయమునందు నిల్పుకొని ధ్యానించుచున్నాను. నన్ను ముట్టుకొనవలదు; నన్నుజూచిన నసహ్యముగానుండును; ఇఁక ముందు నన్ను రాజకుమారి యని పిలువవలదు. సఖీ! నిజము చెప్పుచున్నాను వినుము——నాఁడుమొదలు నాయీశరీరము హీనవంశసంభవుఁడగునాదీనకృషికబాలకుని ప్రేమమునఁ బరిపుష్టమైనది. ఈప్రాణమాతనిని జ్ఞప్తియందుంచుకొనుటచేత నిలిచియున్నది. అతనియందలిప్రేమ నాశరీరమునందలి ప్రతిరక్తబిందువునందునఁ గలిసిపోయినది. ఇంకను వినుము. సఖీ! ఆబూపర్వత

మునుండి తిరిగివచ్చుచున్నప్పుడు ఫకీరునిమందిరమునఁ బండ్రెం డుసంవత్సరములనాఁటియీబాలుఁ డాకస్మికముగా జాగ్రదవస్థలో స్వప్నమును గాంచినట్లు భువనమోహనమ హేంద్రరూపముతో మరల నాకుఁ బ్రత్యక్షమై నాకాళ్ళపైఁ బడియెను. పార్శ్వమునందు రాజమహిషి నిలిచియుండెను. నే నాశ్చర్యముతోడను, ఉల్లాసముతోడను, లజ్జతోడను చైతన్యహీననై నేలపై వ్రాలితిని. ఇప్పుడు నీవు చెప్పుము సఖీ ! ప్రాణ మీదేహమున నంటికొనియుండువఱకు నాతని మఱచిపోవుట యెట్లు ? మఱునాఁడు—సఖీ ! వినుము ! దారిలో నిన్నూర్గురుయవనులు మమ్ముల నాక్రమించిరి. దివ్యతేజోవిరాజితుఁడగు నాప్రియయువకుఁడు తనప్రాణముల నర్పించుటకు సంసిద్ధుఁడై యొక్కసారి తనవికసితనయనములతో నన్నుఁ జూచి పిమ్మటఁ దానొక్కఁడే శస్త్రపాణియై వెడలి యాయిన్నూర్గురుయవనవీరుల నెదుర్కొనియెను. ఆసుకుమారశరీరమునుండి రక్తపానము చేయుట కేకకాలమునందే యిన్నూరునిశితఖడ్గము లెగయుటఁ జూచి నేను మూర్ఛితనై రాజమహిషియంకతలమునఁ బడితిని. నిష్ఠురుఁడగుదుర్గాదాసును, గఠినచిత్తయగురాజమహిషియు నాతని శత్రువులనిశితకరవాలముల కొప్పగించి నన్నుఁగొంపోయిరి. సఖీ ! ఇన్నిదినములకుఁ దరువాత, దానికంతెకును బ్రతీకారముగా నే నాతని మఱవవలయునా?”

విలాసకుమారి యాబాలికను ముద్దిడుకొని, “ఇట్టి

నీవాతని నెప్పటికిఁ గంటఁబడకుండ వెడలిపొమ్మని యెట్టు గుండె దాయిచేసికొని చెప్పఁగల్గితివి ? ఈజన్మమున నీవాతని నింకఁ జూడనని ప్రాణములనెట్లు దిట్టపఱుచుకొని చెప్పఁజాలితివి ?" అనియెను.

అంబాలిక మరల విలాసకుమారికంఠమును గౌఁగిలించుకొని యామె యంసమును గన్నీటచేఁ దడుపుచు "హా సఖీ ! నేను రాజరాజేంద్రునితనయను—అతఁడో ? నీచకులమునఁ బుట్టి నేలను మన్నుకొనుదీనహీనకృషికుఁడు" అనియెను.

## ఆఱవ ప్రకరణము.



అంబాలిక కోరినట్లే కృషికయువకుని బిలిచి విలాసకుమారి రాజకుమారియాజ్ఞ నెఱింగించెను. కృషికయువకుఁ డామెయాజ్ఞ నంగీకరించి వెల్లవాఱఁగనే దుర్గమును విడిచిపోయెద నని చెప్పెను. ఆనాఁటియర్ధరాత్రివేళ దుర్గపార్శ్వమునం దస్తమించుచున్న శుక్రునియల్పకాంతిలో నంబాలికయు విలాసకుమారియు నొకతాటిగుబురునఁ నిలిచియుండిరి. కృషికయువకుఁడు వారియొద్దకు వచ్చి చేతులు మోడ్చి "రాజనందినీ ! మీయాజ్ఞానుసారముగా దుర్గమును విడిచిపోవుచున్నాను. కాని, నన్ను క్షమించినచో నొక్కమాట నడుగఁదలంచితిని. నేను మీయెడల నెట్టియపరాధమును గావించితినో సెలవీయఁ గోరుచున్నాను." అనియెను.

రాజకుమారి ప్రత్యుత్తరమీయలేదు. ఆ యెకటిలోఁ గృషికయువకునకుఁ దెలియకుండ రాజకుమారికన్నులనుండి యశ్రుధారలు ప్రవహించి పోవుచుండెను. కృషికుఁడు మరల "అయినచో నేనిచ్చోటు విడిచిపోవలయునా ?" అని యడిగెను.

రాజకు—(మెల్లఁగా) సాధ్యమగునంత వేగముగా—ఆలస్యముచేయుట యావశ్యకముగాఁ దోఁచుటలేదు.

కృషి—అనయిచో మరల నెన్నినాళ్లకు దర్శింపవచ్చును ?

అంబ—మరల వచ్చి నన్నుఁ జూచినఁ బ్రయోజనమేమి ?

విలా—యుద్ధము ముగిసినపిమ్మట రాజకుమారి నీయువనవిజయమునకు బహుమానపురస్సరముగా వరపుష్పమాలికచే నిన్నలంకరించును.

అంబా—సఖీ! నీకిది వేళాకోళమునకు సమయమా ? పొమ్ము! వీరవరా ! ఇచ్చట నకారణముగ నిలువవలదు.

కృషికుఁడు రాజకుమారి కభివాదన మాచరించుటకు ముందఱికి వచ్చెను. అంబాలిక చీరచెఱఁగుచేఁ గన్నీటిని దుడుచుకొనుచు "వీరశ్రేష్ఠా! వినుము ! నీవు—" అనియెను.

అంతలోఁ గృషికయువకుఁడు వెనుదిరిగి వచ్చి రాజకుమారియెదుట నిలిచెను. రాజకుమారియు "నీవొకదినమున

నన్ను శత్రువులనుండి రక్షించుటకై నిప్రాణముల నర్పించు టకు సంసిద్ధుండ వైతివి. అందులకు బహుమతి నాయీయుంగరమును. నీకిచ్చుచున్నాను" అని చెప్పి తన వ్రేలియందున్న వజ్రపుటుంగరమును దీసి కృషికునిచేతియం దుంచెను. కృషికునికరమునకు రాజకుమారీకరస్పర్శమాయెను. ఆకస్మికముగా వసంతమలయమారుతముచే మాధవీలత తూఁగాడినట్లు రాజకుమారి తనులత నిలువెల్లఁ గంపించెను. వేసవికాలపుఁబ్రదోషసమయమున మందగామినియగు నదీప్రవాహముచేఁ జలించుమృణాళయుగళమువలె నామెభుజములు రెండును గంపించెను. ఉషఃకాలమునందలిపద్మమువలె నామెముఖపద్మ మించుక రాగరంజిత మయ్యెను. మఱియు నాసమయమున నెట్లో యది మనకుఁ దెలియకుండఁగనే యొకసారి—ఒకసారిమాత్రము—రాజకుమారియధరము సశబ్దముగాఁ గృషికయువకునియధరమును స్పృశించెను. రాజకుమారియుఁ జకితయై వెంటనే వెనుకకుజరిగి నిలుచుండెను—విలాసకుమారి నవ్వుచు నంబాలికముఖమువంకఁ జూచెను. కృషికుఁడు "రాజనందినీ! ఆజ్ఞయైనచోఁ జిరకాలమునాఁటియొకమాటను జ్ఞప్తికిఁ దెచ్చుచున్నాను." అనియెను.

అంబాలిక తలయెత్తి కృషికయువకుని గాంచి పిమ్మట దృష్టులను వాల్చి నేలను జూచుచుండెను. కృషికుఁ డిట్లు చెప్పఁదొడంగెను. "నీకు జ్ఞప్తియుండవచ్చును. నేఁటికిఁ బదివత్సరము

లకుఁ బూర్వ మొకనాఁడు రాజసముద్రసరోవర తీరమునఁ గిం శుక వృక్షాగ్రశాఖయందున్న వికసితకుసుమమును నీవు నాకుఁ జూపినప్పుడు "ఎత్తుకొమ్మపైఁ బూవు నెవ్వరును గోయలేరా?" యంటిని. మఱియు—"ఇంతలో వెనుకనుండి యెవ్వరో నవ్వు చు "మఱి—ఎత్తుకొమ్మపైనున్న పూవు తనంతటనే త్రోసిమ వీడి జాఱి చేతఁ బడినచోఁ జెట్టునెక్కవలసినకష్ట ముండదు" అనినట్లయ్యెను.

విలా—(ఆశ్చర్యముతో) ఇంతరాత్రివేళ నల్లగొండ (విజయపాలుఁడు) యిక్కడ కెట్లు వచ్చెను?

విజయపాలుఁడు సమీపమునకు వచ్చి నవ్వుచు "నల్ల గొండ యీనాఁడు కృషికయువకుఁడు జయపుర రాజకుమా రిముఖమును ముద్దాడి యుంగరములు మార్చుకొనుటఁ జూచి చరితార్థుఁడగుటకు వచ్చినాఁడు." అనియెను. విలాసకుమారి యంబాలిక చేతిని బట్టుకొని యక్కడనుండి వెడలిపోయెను. విజయపాలుఁడు నవ్వుచుఁ గృషికయువకునిభుజముపైఁ జేయి వైచి తట్టి "వీరత్వమును రసికత్వమును నాయందుగాక మఱి యెందు నేకాధారము నొందలేదని నేననుకొనుచుంటిని. కాని, నేఁడు నిన్నుఁజూచి యన్నిటియందును నేను నీకోడిపోయితినని యొప్పుకొనుచున్నాను." అనియెను;

---

## ఏడవప్రకరణము.

ఋషికుడు గిరిదుర్గమునుండి వెడలిపోయి ఋషికునిసన్నిధిని నివసించుచుండెను. సమాచారమేమైనం దెలిసినచో వెంటనే పోయి యుద్ధమున సహాయము చేయనై యుండెను. రెండుమూసములైనపిమ్మట నొకనాటిసాయంకాల మంబాలికయు విలాసకుమారియు దుర్గసమీపమున నున్న నదీతీరమున నిలిచి మాటాడుకొనుచుండిరి.

అంబ—నాకు సరిగాఁ జెప్పుము? ఎప్పుడు మనమిక్కడ నుండి నాథద్వారమునకుఁ బయలుదేఱుదము? మీనమేషములను లెక్కింపక బయలుదేఱుదినము సరిగాఁ జెప్పుము. నే ననేకప్రకారములుగాఁ బ్రార్థించి యీమనప్రయాణమును రాజమహిషి నంగీకరింపఁజేసితిని. నీవు నిష్కారణముగాఁ గాలవిళంబనము చేయుచున్నావు. మనము వేగముగా నిక్కడ నుండి వెడలిపోవలయును. దయయుంచి త్వరపడుము.

విలా—కొన్నాళ్ళు చూతము. యవనయుద్ధపర్యవసానము చూడవలదా? నాథద్వారమందిరమునకుఁబోయి సన్యాసినీవేషములఁదాల్చినంతమాత్రమున దుఃఖమంతయు నివారణ యగుననుకొంటివా?

అంబా—(నిట్టూర్పువిడిచి) సఖీ! ఆపవిత్రస్థలమున రాధాశ్యామునిపవిత్రప్రేమప్రవాహము ప్రవహించుచుండు

నని వినియున్నాను. అక్కడ శోకతాపాదు లుండవఁటగాదా ? అక్కడ కేఁగిన స్త్రీపురుషు లాత్మవిస్మృతు లగుదురఁట.

విలా.—సఖీ! కలవలపడవలదు. నీయాశ ఫలించును- అదియేమి?—ఆకోలాహల మేమి ?

ఆకస్మికముగా దుర్గమునం దొకకోలాహలము బయలుదేఱెను. సైనికుల భుజాస్ఫాలనశబ్దమును, నాదోదనధ్వనులతోఁ గత్తుల ఝుణఝుణత్కారధ్వానములును వినవచ్చెను.

విలా.—యవనసైన్యము దుర్గము నాక్రమించినది. రాజకుమారీ! నడువుము! మన మక్కడకుఁ బోయి విజయపాలుఁడు దుర్గము నెట్లు రక్షించుకొనునో చూడవలయును.

అంబా.—ఈయసమసాహసముతోఁ బ్రయోజనమేము న్నది? యవనసైన్యము మనపైఁ బడినచో మనలను రక్షించువా రెవ్వరు?

విలా.—నీతో నేనుండెదను. ఈకత్తి నీవద్దనుంచుము; నారీకరమునం దాయుధ మున్నచో శత్రువా మె నేమిచేయఁగలఁడు?

ఇట్లు చెప్పి విలాసకుమారి తనయుడుపులలోనుండి నిశితకరవాల మొకటి పైకిఁ దీసి రాజకుమారిక కొసంగి, యామె చేయి పట్టుకొని నిస్సంశయముగా ముందునకుఁ బోవుచు "చూడుము, దుర్గసైనికులట్టహాసములు చేయుచు నలుదెసలఁ బరువులిడుచున్నారు. అదేమి? దుర్గదక్షిణ భాగమున విజయ

పాలుఁడు యుద్ధము లేకుండఁగనే బందియై సంకెలలోఁ జిక్కి కొని యడవి పందివలె నఱచుచున్నాఁడు!" అనెను.

వాస్తవముగా విజయపాలుఁడు యుద్ధము చేయకుండఁగనే బందియయ్యెను. నేఁ డాకస్మికముగా యవనులు వచ్చి దుర్గమును ముట్టడింతు రని యెవ్వరు నెఱుంగరు. సైనికు లందఱు నిశ్చేతనులై నిశ్చింతులై యుండిరి. విజయపాలుఁడును నల్లమందును దృప్తికరముగా సేవించి దుర్గముఖద్వారమున నా సాయంసమయమున, నా వేసవి చల్లగాలిని నిశ్చింతగాఁ బరుండి మెలఁకువలోనే గాఢనిద్రాసుఖము ననుభవించుచుండెను. మొదటఁ గ్రమముగా జోగువచ్చి యాజోగులో నల్లమందుమహిమచే నాతఁ డొకయపూర్వస్వప్నమును గాంచెను. కలలో దేవదేవుఁ డొసంగినదివ్యదృష్టిచేత యవనసేనాపతి సైన్యముతో వచ్చి యానాఁడే దుర్గమును ముట్టడించినట్లును, ఆసంగతి యితరుల కెవ్వరికిఁ దెలియనట్లును, దానుమాత్రము తన దివ్యదృష్టివలనఁ దెలిసికొన్నట్లును, వారు వచ్చినప్పుడు తాను దనయసాధారణవీరత్వ మందఱముందుఁ బ్రదర్శించి, విశేషించి యంగనలయెదుటఁ బ్రదర్శించి వారి నాశ్చర్యపడునట్లు చేయవలయునని యోజించి స్త్రీజన మున్నదిక్కునకుఁ బోయి వారియెదుట భుజాస్ఫాలనము చేయుచు, నిప్పుడుమీరు నల్లగొండ యెంతటివీరుఁడో తెలియుదురు గాక, ఆనాఁడు దైవయోగముచే నొక కృషికయువకున కోడిపోయితి నని

నన్నుఁ బరిహాసించితిరి. ఈనాఁడు నే నసహాయశూరుఁడనై వేయిమంది యవనవీరులు వచ్చినను బోడిచి గెలుతునని చెప్పినట్లును, అందుల కంగనలు, నీ వొంటరిగా నందఱుశత్రువుల నెట్లు జయింపఁగలవు? నల్లమందుమత్తు తలకెక్కినదా యేమి? యని నవ్వుచున్నట్లును, అందులకుఁ దాను గర్వముతో భుజాస్ఫాలనము గావించుచుఁ, గొండక్రిందఁ జూడుఁడు! ఎంతమంది యవనులు వచ్చియున్నారో యని చెప్పఁగా విలాసకుమారి, "నల్లగొండ యొక్కఁడును నందఱుయోధులతో యుద్ధము చేయఁజాలఁడు. కృత్తికయువకునిసహాయముగాఁ దీసికొని పోవలయు"నని హెచ్చరించినట్లును, దాను నవ్వుచు "నల్లగొండ యాఁడువారిమాటలకు భ్రమించువాఁడు గాఁడు. ఈసారి జయమాలకుఁ బాత్రుఁడెవ్వరో యంబాలికయే నిశ్చయించుఁ గాక" యని చెప్పి దుర్గమార్గమున నొకచెట్టుచాటున నిలుచుండి యాయిఱుకుదారినుండి యొక్కొక్కఁడుగా వచ్చుచున్న శత్రువులను నఱికి పాఱవేయవచ్చునని యోజించినట్లును, గలగాంచెను. కల యింకను ముగియలేదు. కాని, విజయపాలుఁడు స్వప్నమునందు శత్రువులను దునుమాడవలయునని యోజించుచుండఁగా నల్లమందుమత్తు వీడి మెలఁకువ వచ్చెను. మెలఁకువ వచ్చి చూడఁగా నాతనిస్వప్నము యథార్థమయ్యెను. నలుగురుయవనులు మెల్లఁగా నాతని మంచమునొద్దకు వచ్చి యాతని స్థూలకాయమును జూచి వారిలోవారు పరస్పరసం

జ్ఞలు గావించుకొని, యొకఁడాతనికత్తిని దీసి మంచముక్రిందఁ బాఱవైచెను. మఱియొకఁ డాతనికాళ్లకు సంకెలలు వేసి మంచమునకు బిగించెను. ఇంకొకఁ డాతనిచేతులకును మెడకును సంకెలలు దగిలించి మంచమున కంటఁగట్టుటకుఁ బ్రయత్నించుచుండెను. ఆసమయమున మెలఁకువగన్న విజయపాలుఁడు, తానింకను గలఁగాంచుచున్నట్లే యూహించుకొనుచుండెను. ఒకయవనుఁడు తాను నిలిచియున్న చెట్టుసామీప్యమునందలి గుట్టయెక్కి వచ్చినట్లును, అప్పుడాతనితలఁ ద్రుంచుటకుఁ జేతి నెత్తఁబోయినట్లును—జేతియందుఁ గత్తి లేనట్లును జేయెత్త లేకపోయినట్లును, గ్రమముగా నొకరివెంట నొకరు చాలమందియవనులు దుర్గమువంకకుఁ బరు వెత్తుకొని పోవుచున్నట్లును, వారినెదుర్కొనుటకుఁ దాను లేవఁబోనఁ దనకాళ్ళురాక సంకెలలోఁ జిక్కుకొని యున్నట్లును, గుండెపై నేదియో బరువున్నట్లును గలఁగాంచెను.

అంతలో నాతనికి నిద్రాభంగమై మెలఁకువవచ్చెను. ఆఁడువారిరోదనధ్వనులును,సైనికులకోలాహలధ్వనులును నాతనిచెవులలోఁ బడియెను. ఆతఁ డబ్బువాఱియున్న తనకన్నులను విప్పి చూడఁగా, దుర్గము నలుదెసల యవనసైనికులతో నిండిపోవుటయేకాక తనతలవైపుననల్వురుయవనసైనికులు నవ్వుచున్నట్లును దెలిసికొనియెను. ఆతఁడు "నాకత్తియేదీ!" యనుచు లేవఁబోయెను. అక్కడనున్న యవనసైనికులలో నొకఁడు

"కాఫర్! నోరెత్తక పడియుండుము. కాలుచేతులకు సంకెలలు దగిలింపఁబడియెను" అనెను.

విజయపాలుఁడు క్రోధాశ్చర్యములతోఁ జీత్కారము సేయుచు "ఓరీ, యవనా! నాయొద్దఁగూడ మోసమా! చేతికిఁగత్తి నిచ్చి యుద్ధముసేయుము" అని యఱవఁజొచ్చెను.

"నీయుద్ధనైశద్య మిప్పుడే తెలిసికొనెదను" అనుచు నాయవనులలో నొకఁడు విజయపాలునివంకఁ గత్తి నెత్తిపట్టుకొని యెను. మఱియొకఁడాతని చేయి పట్టుకొని నిరస్త్రుఁడగువీరుని జంపరాదని చెప్పి "కాఫరుఁడా! మేము కరుణించి నీప్రాణములను నిల్పియుంచితిమి. వ్యర్థముగా నఱచెద వెందులకు?" అనియెను.

విజ—పాపిష్ఠియవనుఁడా! నీదయ నాకక్కఱలేదు. కత్తి నిచ్చి నాతో యుద్ధము సేయుట నీకు భయమైనచోఁ గత్తిని నీవే పుచ్చుకొని యీఁడువా రేడ్చుచున్నస్థలమునకు నన్నుఁ గొనిమ్ము.

యవ—మరల హెచ్చరించుచున్నాను. అఱవవలదు—అఱచుట మానకున్నచో నిప్పుడే నీప్రాణములు తీసికొనియెదను.

విజయపాలుఁడు—పిచ్చివానివలెఁ బండ్లు పటపటఁ గొఱికికొనుచుయవనుఁడు పిచ్చివాఁడా! అతఁడు చెప్పునదేమి? యుద్ధముచేయవలదు. యవనుని యమాలయమునకుఁ బంపవలదు.

కేకలు వేయవలదు ! ఇంతేనా? ఓయవనుఁడా! నీయిష్టమేమి? సంకెలలతో నిచ్చటనే యుండుమనియా? అధముఁడా! సంకెలలు దీయువఱకు నేను కేకలువేయుచుఁ బర్వతమంతయుఁబ్రతి ధ్వనించునట్లు చేయుదును"అనియెను. యవనులు నల్వురును బిగ్గఱగా నవ్వసాగిరి. విజయపాలుఁడు తనసైనికులఁగూర్చి "సైనికులారా! మీరు వేగముగా వచ్చి నాసంకెలలను విడిపింపుఁడు. "యవనులను యమసదనమునకుఁ బంపి నాపగదీర్చికొందును" అని కేకలువేయసాగెను.

విజయపాలుని కేక యెక్కడకును బోలేదు. ఎవ్వరు నక్కడకు రాలేదు. దూరమునందున్న యంబాలికావిలాస కుమారికలచెవుల కాగందరగోళము వినఁబడియెను. కొండలను భేదించునట్లుగొండనిచీత్కారమును, రణకోలాహలమును, నారీమణులహాహాకారమును, ఆయవనులనవ్వులలో నణఁగిపోవు చుండెను.

అంబా——సఖీ! బయలుదేఱుము. ఇక్కడఁ గాలహరణము సేయుట మంచిదిగాదు. అదిగో, చూడుము! యవనాశ్వారోహకుఁడు మనవంకకే వచ్చుచున్నాఁడు.

విలా——యవనుఁడుగాఁడే సఖీ ! యవనవేషధారియైన హిందువుఁడే.

యవనవేషధారియు వారిసామీప్యమునకు వచ్చెను. అంబాలికచేతియందున్నకత్తి చటాలునఁ గ్రిందఁబడిపోయెను.

"యవనవేషధారి" అసల్ మీరు రాజకుమారుఁడగు కేసరసింహుఁడు!

కేస—రాజకుమారీ! ఇప్పుడైన నేఁజెప్పినదాని నొప్పుకొనుము. ఇప్పుడు నిన్ను యవనులబారినుండి తప్పించి నాపాప ప్రయత్నమునుండి మరలెదను.

విలా—(చకితయై) యవనులను దీసికొనివచ్చినది నీవా?

కేస—(వికటహాసముతో) అంబరరాజకుమారి నడుగుము. చాలదినములకుముందుగనే యాఁబాలికకు నాపైశాచిక ప్రతిజ్ఞ తెలియఁబఱచి యుంటిని.

అంబా—అంబరరాజకుమారి నీవంటి పిశాచసదృశుని వరించుననునాశ నీకింకను మిగిలియున్నదా?

కేస—అయినచో నాపైశాచిక వ్రతమే పూర్తిగానిమ్ము. హుస్సేనాలీ, ఖోదాద్, పీరుభక్ష్! మీ కీరమణిని వెదకుచున్నారుగాదా? ఆమె యిక్కడనే యున్నది. మేనాసవారి నిటు తీసికొని రండు.

చాలమందిముసల్మానులు పరుగెత్తుకొని వచ్చి రాజకుమారిని జుట్టుముట్టిరి. కేసరసింహుఁడు యవనసైనికులచేఁ జుట్టుకొనఁబడినయాయపార్థివదేవమూర్తిని జూచి నాప్రతిజ్ఞ నెఱవేఱినది. ఈరమణి పాఱిపోకుండఁ జూచుకొనుభారము మీది. నే నప్పుడే పోయి మీనవాబున కీవార్త నెఱింగించెదను.



## ఎనిమిదవప్రకరణము.

---

పర్వతమునకు మూఁడుకోసులదూరమునందున్న యొకనిర్జనమార్గమునఁ గొందఱుబోయవాం డ్రొకమేనాసవారిని మోసికొని పోవుచుండిరి. సవారితోఁ గొందఱుకాలుబంట్లును ఒకగుఱ్ఱపురౌతును బోవుచుండిరి. గుఱ్ఱపురౌతు పాఠకులకుఁ బరిచితుఁడైనపీరుభక్షుఁడు. పల్లకియందున్నవా రంబాలికావిలాసకుమారికలు. ఎంతయో రాత్రి గాలేదు. కృష్ణపక్షసప్తమీ చంద్రుఁడప్పుడే యుదయించుచుండెను. విలాసకుమారి పల్లకి తలుపులను దెఱచి, పీరుభక్షుంగూర్చి "ఖాన్‌సాహేబ్! మీరు పిలిచినంతనే మనఃపూర్వకముగా నేను మీతో వచ్చుటచేత మీమనస్సులో ననేకభావములు పుట్టియుండవచ్చును. మీ కెన్నియో సందేహములును గల్గియుండవచ్చును. నామనసునం దేదియో దురభిప్రాయ ముండవలయుననియు, మేము దుర్వర్తనము గలవార మనియు, నందుచే మేము కులత్యాగినులమై వచ్చుచున్నారమనియు మీరు యోజించుచున్నారేమో? కాని, నాహృదయమునందు నాటియున్న ప్రేమ మతిబలవత్తరమైనది. కావునఁ దమ్ముఁ బ్రేమించువారి కంగనలు తమప్రాణమునైన నర్పింపఁగలరు. ఇట్లని మీరు మొట్టమొదట భావించి యుండ లేదుఁ గాఁబోలును" అనియెను.

పీరు—(గద్గదస్వరముతో) ప్రాణప్రియా! నారీప్రే మమును నేను బాగుగ నెఱుంగుదును. దానికి మాఖురాను నందు "ఇస్కా" అని చెప్పఁబడియున్నది. నా మస్తిష్కమునం దును నామనసునందును, నానరములయందును, నా యెము కలందునుగూడ నా "ఇస్కా" జ్వాలలై జ్వలించుచున్నది.

విలా—ఖాన్ సాహెబ్! మీ కెందఱు భార్యలు?

పీరు—మొత్తము ముగ్గురికంటె నెక్కుడు మంది లేరు. దానికై నీవు విచారింపనక్కఱలేదు. వారందఱు నీకుఁ బరిచారికలై యుండఁగలరు. నీపాదసేవ చేయఁగలరు. ఒక్కతె తలదువ్వును; ఒకతె యలంకరించును; ఇట్లేవారు నీకు వలయు నుపచారము లొనరింపఁగలరు.

విలా—వారు మాంసమును దిందురు—ఉల్లిపాయలు తిందురు. నేను వారితోఁ గూడి యెట్లుండగలను? కాని, మీకు దయయున్నచో నాకేమియు భయములేదు. అయినచో నన్నెప్పుడు "నిక్కా" (పెండ్లి) చేసికొందురు?

పీరు—రేపటియుదయమునకు నవాబుశిబిరమునకుఁ జేరుదుము. నీ స్నేహితురాలిని నవాబున కొప్పగించి పిమ్మట నిన్ను మసీదునకుఁ గొంపోయి "షరా" (పెండ్లిమంత్రము) చదివించెదను.

విలా—నవాబుశిబిర మెంతదూరమున్నది? ఎంతసేపటిలో మన మక్కడకుఁ బోఁగలము?

పీరు—ఎంతో దూరము లేదు. ఇక్కడ కుత్తరముగాఁ "బాళి"యనుగ్రామమున్నది. నవాబు గ్రామమునందున్నాఁడు.

విలా—దుర్గసైనికులు వచ్చి మార్గమధ్యమున మనల నడ్డగించి మమ్ము విడిపించుకొని పోయినచో నేమిచేయవల యును ?

పీరు—హృదయేశ్వరీ! ఆభయ మేమియును లేదు. దుర్గసైనికులు వచ్చి యడ్డుకొనఁగలరనుభయముచేతనే తిన్నని మార్గమున సైనికులందఱినంపి మిమ్మొకొండగుట్టల నడుమ నుండి యరణ్యమార్గమునఁ దీసికొనివచ్చుచుంటిని.

విలా—మీనవాబు పేరేమి ?

పీరు—అఫ్‌జుల్ ఖాను.

ఆకస్మికముగా విలాసకుమారిముఖమండల మెఱ్ఱవడిపో యెను. "ఖానుసాహెబ్ ! నాకు దప్పిక యగుచున్నది. ఈచేరువలో నీరుదొరకునా?" అని యడిగెను.

పీరు—దప్పియైనచో నిప్పుడే నీరు దెచ్చి యిచ్చెదను. తినుట కాహారముగూడ నున్నది. ఇంచుక పేర్చినమాంసము గూడఁ గలదు.

విలా—రామరామ! హాస్యమునకై యడుగుచున్నారా?

పీరు—(ఇంచుకసందియముతో) కాఁగూడదా? నన్ను బెండ్లియాడుటకు సందేహ మున్నదా ?

విలా——మనకింకను బెండ్లి కాలేదుగాదా ? "నిక్కా" చేసికొనకుండఁగనే మీచేతినీ రెట్లుత్రాగుదును? రేపు పెండ్లి యైనపిమ్మట నేమిచేసినను జేయవచ్చును. కాని——

పీరు——ప్రాణప్రియా! వలదు——నేను మఱచియిట్లంటిని. మనతో హిందువు లెవ్వరును లేరుగదా! నీకు నీరుదెచ్చి యిచ్చువా రెవ్వరు ?

విలా——అకనఁబడుచున్న పుష్కరిణికి నన్నుఁ గొంపోయినచో నేనే నీరుద్రావుదును. తరువాతఁ దిరిగి రావచ్చును.

విలాసకుమారి యంబాలికచెవిలో నేమేమో చెప్పెను. పీరుభక్షుఁ బోయలను బ్రతీహారులనుజూచి, ఇక్కడనే యుండుఁడనిచెప్పి విలాసకుమారితో సరోవరముచెంతకై పోయెను. ప్రకృతి స్థిరగంభీరభావముతో నిశ్శబ్దముగా నుండెను. వికటాకారముతోఁ బ్రేతమువలె నున్నయాపీరుభక్షుని, రమణీకులమునకు రాజ్ఞవలెనున్నవిలాసకుమారినిఁ జూచిచూచి భూమ్యాకాశము లావిరుద్ధదృశ్యమునకు వింతపడి నిశ్చేష్టితములైనవో యనునట్లు నిస్తబ్ధము లైయుండెను. చంద్రుఁడును కలువకన్నెయు నొండొరులం జూచుకొనుచు నవ్వుకొనుచుండిరేమో యనునట్లగపడుచుండెను. కమలము లసహ్యముతోఁ గసు లజ్జతోడను మొగములు ముడుచుకొని వెన్నెలతెరచాటునుండి మాటాడకుండఁ దొంగిచూచుచున్నట్లు లుండెను.

విలా——చేతితో నీరుద్రావుట యెట్లు ? నాకొక తామరాకును దెచ్చి యిమ్ము నీరు లోతుగా లేదనుకొందును.

పీరు—నీరు ఛోతుగా నున్నను నే నీఁదఁగలను. నీటిలో నికైనను, అగ్నిమధ్యమునకైనను, ఆకాశముమీఁదికైనను, నీ వెక్కడకుఁ బోవుమనినను నీ యీ గులాము సిద్ధముగా నున్నాఁడు

విలా—మీరు గుఱ్ఱముతో దిగనక్కఱలేదు. నేను మీగుఱ్ఱపుకళ్లెమును బట్టుకొని యుండెదను. గుఱ్ఱముపైనుండి యే వంగి, నీటిలో నున్నతామరాకు నందుకొనుఁడు. అంతే కాక సిగ్గుచేఁ దల్లవంచుకొని యున్న పద్మకుసుమమునుగూడఁ గోసికొనిరండు. జాగ్రతసుండీ! పువ్వు గోయునపుడు ముండ్లు గ్రుచ్చుకొని చేతికిగాయ మగునేమో?

విలాసకుమారి గుఱ్ఱపుకళ్లెమును బట్టుకొనియెను. పీరు భక్షు ముందటికి వంగి పద్మమును గోసి యిచ్చెను. తామరాకు గోయుటకై క్రిందికి వంగెను. విలాసకుమారియు వంగియున్నపీరుభక్షునికంఠముపై గుఱిచూచి కాలితో బలముగా నొక తన్ను దన్నెను. పీరుభక్షుఁ గంభీరశబ్దముతో గంభీరజలములఁ బడి, గంభీరస్వరముతో నఱచుచు "హా! సైతాన్!" (పిశాచి) యనియెను.

విలాసకుమారి రెప్పపాటుకాలములోఁ బీరుభక్షుని గుఱ్ఱము నెక్కి దుర్గాభిముఖముగా మాయమైపోయెను.

విలాసకుమారి యింతకుముం దొకసారి కృషికకుమారుని వెంటఁబెట్టుకొని కొండ నెక్కినమార్గమునఁ బోయియక్క

డ గుఱ్ఱము నాఁపెను. ఆమె యక్కడ నొక శాల్మలివృక్షశాఖకు మగదుస్తులను దగిలించి యుంచిన మాట చదువరులకు జ్ఞప్తియందుండనచ్చును. అక్కడ విలాసకుమారి పురుషవేషమును ధరించి మరల గుఱ్ఱముపై నెక్కి బయలుదేఱెను. కొంత దూరము పోయి చూడఁగా నాకొండదారియందు రక్తధారలును, అందంపు యువనమృతదేహములును, తెగిపడిన మొండెములు నామెకుఁ గానవచ్చెను. ముందటి కేఁగినకొలఁదిని మార్గము శవమయమై గుఱ్ఱము నడచుట కష్టమగుచుండెను. ముందుపై పించుకదూరమున నరకళేబరములు కొండగుట్టలవలె గుట్టలుగుట్టలుగాఁ బడియుండెను. అంతమందియువనులను జంపినవారెవ్వరు? ఆప్రక్కనదియేమి? అచలములై యున్నయా శవములనడుమ దివ్యతేజోధారియైన యామసల్మానుఫకీరు! ఆతఁడాశవమధ్యమున నొంటిరిగా గూరుచుండె నేమి? విలాసకుమారి మంత్రముగ్ధవలెనై నిశ్చలదృష్టితోఁ జూచుచుండెను. ఫకీరు చైతన్యవిహీన మగునొక దేహము నెత్తి తొడపై నుంచుకొని యాపధమును బూయుచుండెను. కొయ్యవలె నున్న యాదేహమంతలోఁ జైతన్యమునొంది కన్నులు తెఱచెను. అరవిచ్చియున్నయాకన్నుల కెదురుగా ఫకీరు తనవ్రేళులను రెండుమూఁడుసారులుతిప్పి మధురకంఠస్వనము నిర్జనపర్వతప్రదేశమంతయుఁ బ్రతిధ్వనించునట్లు "లెమ్ము! వత్సా! నీవుబ్రతికియుంటివి" అని పిలిచెను.

అమృతమయమగునాకంఠస్వరము చైతన్యము నొందె నో యన్నట్లుగా, నచేతనమగు నా దేహము నిద్రనుండి మే ల్కాంచినట్లు లేచి నిల్వఁబడియెను. ఆశ్చర్యముపైనాశ్చర్యము! ఆతఁడు కృషీకసైనికుఁడు!

కృషీ—ఈనాఁడు యవనయుద్ధమున నాయాయువు తుదముట్టినదని యెఱిఁగి వచ్చి మీరు నాకుఁబ్రాణదానముచే సితిరి.

ఫకీ—వత్సా! మనుష్యుని మృతదేహమునకుఁ బ్రాణ ము వోయుట మనుష్యునకు సాధ్యమా! గాఢనిద్రలోఁ బరుం డియున్నవానిని మేలుకొల్పితిని. దుర్గమును ముట్టడించి రని విని నేను వలదనుచున్నను నీవొంటరిగా వచ్చుటను జూచి సం శయమనస్కుఁడనై నీవెన్నంటి వచ్చితిని. మృతకళేబరములమ ధ్యమున నీవు మూర్ఛితుఁడవై పడియుంటివి.

కృషీ—మీరు దయతోఁ బ్రాణములనిచ్చి బ్రతికిం చిన యీశరీరమువలన నేదైననొకయుపకారముగావలయును. దొంగలుపల్లకి నెచ్చటికిఁ దీసికొనిపోయిరి? వేగముగా సెల విండు.

ఫకీ—నేను పల్లకిని జూడలేదు.

కృషీకుఁడు కళవళముతోడను క్రోధముతోడను నొడు గఱచి "ఏనచో నారాక్షసులు సురసుందరియగు నాయంబా

లిక నేమార్గమున నెచ్చటకుఁ గొంపోయినదియు, నాకుఁజెప్పు వా రెవ్వరు?" అని యడిగెను.

విలాసకుమారి ముందఱికి వచ్చి "నేను—నేను చెప్పఁ గలను. నాతండ్రి యగుసీగురుదేవునియాశీర్వాదముచే స్థితిగతులన్నియుఁ దెలిసికొని కౌశలముతో యవనులచేతినుండి తప్పించుకొని, యీవార్త నెఱింగించుటకై వేగముగా దుర్గమునకు వచ్చుచుంటిని" అనియెను.

కృషికుఁ డాశ్చర్యవిలాసములతో విలాసకుమారిముఖమండలమును జూచి "అట్లైనచో "దేవీ! బయలుదేఱుము. నాకు మఱియొకసారి యవనయుద్ధక్షేత్రమునకు మార్గము చూపింపుము." అనియెను.

---

## తొమ్మిదవ ప్రకరణము.

—)o(—

వీరభక్తు కష్టముతో జలములనుండి లేచిచూడఁగా నాతనిప్రాణప్రియతో గుఱ్ఱముగూడ నదృశ్యమై పోయెను. ఆనిరాశాపేమికుఁడు శరీరము మిక్కిలి నొచ్చుచుండుటచే నిట్టూర్పు విడిచి యశ్వవాహినియగు నాపిశాచింగూర్చి యనేకమధురనామములతోఁ బొగడుకొనుచుఁ బల్లకియున్నచోటికిఁ బోయి, తనయనుచరులంగాంచి, సాధ్యమగునంత వేగముగా కాఫర్ సుందరిని నవాబుశిబిరమునకుఁ దోడ్కొనిపోవలయు

ననియు, నాలసించినచో నాపిశాచి మరల వచ్చి మనల నాపన్నులఁజేయుననియుఁ జెప్పి "ఆహాహా! అంతటిపిశాచిని నేను స్వప్నమునందైనఁ గని విని యెఱుఁగన." అనుకొనియెను.

రాతిరి గడచిపోయినది. సవారి ముసల్మానుశిబిరమునకు వచ్చిచేరెను. అంబాలిక "ఇప్పు డుపాయమేమి? విలాసకుమారి సవారి దిగి పీరుభక్తులనితోఁ బుష్కరిణికిఁబోవుచున్నప్పుడు వేగముగా దుర్గమునకుఁ బోయి వార్త నెఱింగించి వచ్చి మధ్యమార్గముననే నన్నుద్ధరించెద నని చెప్పియున్నది. ఆమె యిప్పు డెక్కడ నున్నది? ఎవ్వరును రాలేదు! ఇఁక బ్రాణములను విడుచుటకంటె వే ఱుపాయములేదు." అనుకొనుచుఁ జురియను దీసి చేతఁబట్టికొని యాకాశమువంకఁ జూచుచు "దైవమా! ఆత్మహత్య మహాపాతక మని వినియుంటిని. దీననాథా! యవనులబారినుండి తప్పించుకొనుట కింకొక యుపాయమేమియుఁ గానిపించుట లేదు" అనియనుకొనియెను.

చప్పుడుచేయుచు నెవ్వరో సవారితలుపులను దెఱచిరి. అంబాలిక వడఁకిపోవుచుఁ దొంగిచూచెను. వెలుపలఁ గేసరసింహుఁడును, అతనిపార్శ్వమున వికటాకార యవనుఁడొకఁడును నిలిచియుండిరి. కేసరసింహుఁ డుచ్చస్వరముతో "యవనసేనాపతీ! విధాత యీకనకపారిజాతలతికను నిజముగా నరకమునఁ బాఱవేయుటకే సృజించెనా?" అనియెను.

అఫ్ జుల్ ఖాను కేసరసింహునిమాటలను గ్రహింపక

"నిజముగా నాప్రాణములున్నంతవఱకు నీకు ఋణపడియుండె దను. పాదుషావారికిఁ జెప్పి నీకుఁదగినబహుసిమానము.-—

మాట ముగింపకుండఁగనే కేసరిసింహుఁడు వికటహాసము చేయుచు "బహుమానమా? యవనసేనాపతీ! అయినచో నాకిక్కడనే యీసుందరియెదుటనే బహుమానము నిమ్ము. నీశిబిరమునం దిప్పు డెక్కడ నెంతమంది సైనికు లున్నారు?" అనియెను.

అఫ్జుల్—ఇన్నూఱుమందిమాత్రము. తక్కినవారిని నీతో దుర్గము నాక్రమించుటకుఁ బంపియుంటిని గాదా? వారింకను దిరిగి రాలేదు. నీవీమాట యెందుకడిగితివి?

కేస—అఫ్జుల్ ఖాను ! ఇన్నూఱు సృగాలములతో నొక కేసరి యుద్ధము సేయుట నీ వెప్పుడైనను జూచియుంటివా?

అఫ్—లేదు—నీమాటలు నాకర్థమగుట లేదు.

కేసరసింహుఁడు కత్తి నొఱనుండి తీసి గట్టిగఁబట్టికొని రెండవచేత నఫ్జుల్ ఖానుమెడపట్టి వంచి పురుషసింహము వలె గర్జించుచు "ఓసృగాలములారా! మీరందఱును నేకమై యీకేసరిబలమును బరీక్షింపుఁడు. కానిచోఁ జూడుఁడు. ఇదిగో కేసరి మీసేనాపతివక్షముం జీల్చి రక్తమును గ్రోలుచున్నాఁడు" అనియెను.

కేసరసింహునిఁ బట్టుకొనుటకై నలుదెసలనుండి సైని కులు పరుగెత్తి వచ్చిరి. కేసరసింహు డఫ్జుజుల్ ఖానుకుత్తుక వీడి "సురసుందరీ! అంబాలికా! ఈహృదయమును దహించు చున్న భయంకరానుతాపాగ్నిని శాంతింపఁజేయుటకై యీకే సరి సృగాలనఖాఘాతములచేఁ బ్రాణములు విడిచి, తనపై శాచిక ప్రతిజ్ఞకుఁ దగినప్రాయశ్చిత్తము గావించుకొనును" అని కేక వైచి చెప్పెను.

ఇన్నూర్గురు ముసల్మానుసైనికుల యిన్నూఱు నిశితకర వాలములనడుమ నసహాయశూరుఁ డగురాజపుత్రవీరునికర వాల మొక్కటియే ప్రబలపరాక్రమముతో భీషణశబ్దమును గావించుచుఁ జక్రాకారమునఁ దిరిగిపోవుచుండెను. శవము లపై శవములు పడిపోవుచుండెను. మొండెములపై మొండె ములు పడుచుండెను. అయినను యుద్ధమునకు విరామము లేదు. క్షత్రియవీరునిచేతిలోఁ దిరుగుచున్న ఖడ్గమునకువిశ్రాం తిలేదు. నేఁడే కేసరి సృగాములన్నిటిని సంహరింపకుండ నిలుచున ట్లగపడుట లేదు.

ఆకస్మికముగా దూరమునుండి "హొదువుఁదుహొదువుఁదు" అనుహిందూవీరులకేకలు వినఁబడఁజొచ్చెను. కేసరసింహుఁడు తిరిగిచూచునంతలో విజయపాలుఁడును, గృషికయువకుఁడును దుర్గమునందలిసైన్యమును దీసికొని యుద్ధరంగమునకుఁ బరు గెత్తి వచ్చుచుండిరి. కేసరసింహుఁ డుచ్చస్వరముతో వికటా

ట్టహాసమునః జేయుచు "మీరు దూరముగా నిలిచి చూచుచుం డుఁడు; కేసరియొక్కఁడే మిగిలియున్న సృగాలములతో యుద్ధముచేయఁగలఁడు" అనియెను.

విజ—(నవ్వి) ఎవ్వరితో యుద్ధముచేయుదువు? అదిగో చూడుము; సీనక్కలన్నియుఁ బాఱిపోవుచున్నవి. అయ్యయ్యో! నాకుసంకెలలువేసిన యీనక్కలకుఁ దగిన ప్రతీకారముచేయవలయు ననుకొంటిని; పాఱిపోవుచున్న శత్రువును సంహరించుట క్షత్రియధర్మము గాదు.

కేసరసింహుఁ డావంకఁ దిరిగి చూచెను. ముసల్మాను సైనికులు రణరంగమును వీడిపాఱిపోవుచుండిరి. ఆతఁడుక్రోధసంక్షుభితహృదయుఁడై గర్జించుచు "పాఱిపోవుచున్న శత్రువులను జంపుట క్షత్రియధర్మముగాదు" అనిచెప్పుచుఁ దనచేతియందున్న కత్తిని విసరి పాఱవైచి పాఱిపోవుచున్నయవన సైనికుల ముందఱిభాగమునకుఁ బరుగెత్తుకొని పోయి రెండుచేతులను బైకెత్తి వారి నడ్డగించెను.ఆతనికుడిచేయి తెగి క్రిందఁ బడిపోయెను. మరలఁ బరుగెత్తుకొని పోయి యెడమచేతితో వారి నడ్డగించెను. ఆతనిరెండవచేయియు రెండుతుండెములై క్రిందఁ బడియెను. అయినను గేసరి సృగాలయుద్ధమును విరమింపలేదు. మరలఁ బరువెత్తుకొని పోయి శత్రువులను గాలితో నాక్రమించెను. ఆసామీప్యమునందు ఛిన్నమస్తకమగు కేసరసింహుని సుకుమారవీరదేహము వసుమతీవక్షమున వ్రా

లెను. కేసరిసృగాలయుద్ధము ముగిసినది. రాజపుత్రవీరుని భయంకరపాపమునకు భయంకరప్రాయశ్చిత్త మయ్యెను. హిందూవీరుఁడు సమ్ముఖయుద్ధమున శత్రుకరవాలములచేనశ్వరనరదేహమును విడి శాశ్వతానంద ధామమునకు వెడలిపోయెను.

---

## పదవ ప్రకరణము

అఫ్జుల్ ఖాను చాలదూరము పరుగెత్తుకొని పోయి వెనుదిరిగి చూచెను. ఒకయాశ్వికుఁడు మాత్రము వానిని వెన్నంటి వచ్చుచుండెను. ఖానుసాహేబు మఱింత వేగముగాఁ బరుగెత్తుకొని పోయి తనప్రాణములను గాపాడుకోవలయు ననునాశతో మిట్టపల్లములను తాయిఅప్పలను గణింపకుండ గుఱ్ఱమును వాయువేగముతోఁ బరుగెత్తింపఁజొచ్చెను. అతఁ డట్లుకొంతదూరము పోయి మరల వెనుదిరిగి చూచెను. అతి వేగముతో వెన్నాడి పరుగెత్తుకొనివచ్చుచున్న యాఁరౌతుముఖ ముచూచునప్పటి కాతని కించుక ధైర్యము గలిగెను. ఆయా శ్వికుని మొగము బాలునిముఖమువలెనుండెను. ఒక బాలుని తో యుద్ధముచేయుట కాతనికి భయములేదు. ఇంతలో బాలునికి సహాయుగా నెవ్వరు రాఁజాలరు. ఖానుసాహేబు నలు దెసలు పరికించిచూచెను. ఎవ్వరు వచ్చుటలేదు. అంతలో

బాలుఁడాతనిని నమీపించెను. అఫ్జుల్ ఖాను కాఫర్ యువకుఁడా! అన్యాయముగా నాచేతిలోఁ బ్రాణముల నర్పించుటకు వచ్చితివా?" అనియెను.

కాఫ—మూర్ఖుఁడా! నేను యువకుఁడను గాను. నేనాఁడుదానను. పాఱిపోక నిలిచి యొక్కసారి కాఫరు కాంతతో యుద్ధముఁ గావింపుము.

అఫ్జుల్ ఖాను భయముతో వెనుతగ్గి సందేహించి కాఫర్ కుమారుని మోముఁబరీక్షించిచూచెను. కాఫర్ యువకుఁడు తలపైనున్న పాగను దీసి దూరముగాఁ బాఱవైచెను. కాలమేఘమధ్యమునుండి కానవచ్చు పూర్ణచంద్రబింబమువలె విలీలచంచలాలక జాలాంతరాళమునుండి కామినీకమనీయముఖమండలము గానవచ్చెను. విలాసకుమారి "సేనాపతీ! ఇప్పుడు నన్ను గుర్తించితివా? నేనెవ్వరు?" అని యడిగెను. యవన సేనాపతి భయాశ్చర్యములతో భువనమోహినియై శచీదేవివలెనున్నయాసుందరీమణి నవలోకించి వెల్లవాఱిన మోముతో వికృతి నందినస్వరముతో "విక్రమసింహుని తనయవా?" అనెను.

విలాసకుమారియు నొక్కపరుగునఁ బోయి యాఁడుసింగమువలె నఫ్జుల్ ఖానుమెడ నొడిసిపట్టుకొని వంచి మఱియొక చేత నిశితకరవాలమునుబైకెత్తి "విక్రమసింహునితనయ నేఁడు తనపితృహంతకునిరక్తముతోఁ బితృతర్పణము సేయును. సాధ్యమైనచో నాత్మరక్షణము నారసికొమ్ము." అనెను.

ఖాన్ సాహెబు వడఁకుచుఁ జేతిలోనికత్తి నెత్తి విలాసకుమారికుత్తుకకుఁ గుఱివెట్టివిసరెను. కాని, యవనసేనాపతి ఖడ్గ మాసురేశ్వరికంఠముపైఁ బడకపూర్వమే యాతనిఛిన్నమస్తకము విలాసకుమారిచేతిలోఁ బడియెను. ఒక్కముహూర్తములో—ఆనాఁడు కేసరికిని సృగాలమునకును జరిగినయపూర్వయుద్ధమునందుఁ జేరినహిందూవీరులందఱును—నిశుంభసంహారిణి యగుసింహవాహినిలె శత్రురక్తముతోఁ గెంపువాఱిన భీషణ ఖడ్గముతోడను, శోణితసిక్తశరీరముతోడను, ఆజానులంబిత కేశకలాపముతోడను, దానవఛిన్న మస్తకము హస్తమునఁ దాల్చివచ్చుచున్నయావీరనారీమూర్తి నాశ్చర్యముతో నవలోకింపసాగిరి.

---

## పదునొకొండవ ప్రకరణము.

మఱునాఁటిప్రభాతమున విజయపాలుఁడు సైన్యసమేతుఁడై యంబాలికను విలాసకుమారిని వెంటఁబెట్టుకొని మాతృమందిరమునకు వచ్చి కృషికకుమారుని యనుపమానశౌర్యప్రతాపములు దశదిశలఁబ్రసరింపఁజేసెను. ఆనాఁడు దుర్గమునందంతటను దరుణసైనికవీరునిప్రశంసతక్క వేఱుప్రస్తావమే లేదు. ఆతఁడెవ్వఁడు? ఎక్కడనుండి వచ్చెను ? అనునాలోచనలే విశేషముగా బయలుదేఱెను. సైనికులందఱు గూఢపులు

గుంపులుగాఁ జేరి, నల్లమందు మొదలగు మత్తుపదార్థములను జక్కఁగా సేవించి దివ్యజ్ఞానసంపన్నులై పైవిషయములను దర్శించి సిద్ధాంతీకరింపఁజొచ్చిరి. ఒకఁడు, "ఆయూపనుఁడు పూర్వజన్మమున విఖ్యాతరాజవంశమునఁ బుట్టి యొక బ్రాహ్మణుని శాపముచే నేఁడిట్టినీచవంశమునఁ బుట్టినాఁ"డని నిర్ధారణము గావించెను. మఱియొకఁడు, "అట్లుగాదు, నీవు చెప్పునది తప్పు. నీవు నల్లమందుమత్తుచేఁ గనకుండ వినకుండ మనసునకు వచ్చినట్లెల్లమాటలాడుచున్నావు. ఆతనియథార్థచరిత్రము నెఱుఁగఁ దలంచినచో నేను చెప్పెదను వినుము. ఆకుమారుఁడు విజయపాలు నోడించి పతాకఁ జేతఁబట్టుకొని మందిరాగ్రభాగము నుండి దిగివచ్చుచున్నప్పుడు నేనతనిసంగతు లన్నియుఁ దెలిసికొంటిని. అన్నా! అతఁడు మనుష్యుఁడు గాఁడు—భూతపుత్రుఁడు. మాఱువేషముతో వచ్చి కృషికకుమారుఁడనని చెప్పుకొనుచున్నాఁడు" అనియెను. ఒకముదుసలిమార్వాడి "మీరందఱును బిల్లలు! మీకీసంగతి తెలియుట యెట్లు? నేను వృద్ధఫకీరునద్దకుఁ బోయి తెలిసికొనివచ్చితిని. ఫకీరొకనాఁడు స్వర్గమున కింద్రునికడకుఁ బోయి యూరంగజేబుపాదుషాను సంహరించుట కాతనిసాయము గోరెను. సురేంద్రుఁడు స్వయముగా వైకుంఠమునకుఁ బోయి విష్ణుని బ్రార్థించి, యీ బాలవీరుని దీసికొనివచ్చియవనవధ గావించుటకు ఫకీరునితోఁ బంపించెను. ఆతఁడు మనుష్యుఁడు గాఁడు. దేవతాకుమారుఁడు" అనియెను.

విలాసకుమారి ముగ్ధాంగనలనందఱ గుంపుగాఁ జేర్చి కృషికవీరుని శౌర్యవృత్తాంతమును సవిస్తరముగా నొక్కటొక్కటిగాఁ జెప్పఁదొడంగెను. "అసహాయుఁడగునీవీరకుమారుని ఖడ్గాఘాతములచే ననేకయవనుల ఛిన్నమస్తకములు ధరణీతలమునఁ బడి పొరలఁ జొచ్చెను. ఆరావళీపర్వతసమభూమియందు శత్రురక్తనదులు ప్రవహించిపోయినవి. ఆతని యసమానవీరత్వముచేతను, అసాధారణసాహసముచేతను సంబరరాజకుమారి శత్రువులబారినుండి తప్పింపఁబడినది. అట్టివీరు నెవ్వరైన నెచ్చటనైనఁ జూచియున్నారా? ఆనాఁడు మాతృమందిరమున మాతృదేశారాధనకై చేరిన రాజస్థానరాజవంశవీరులలో నొక్కఁడైన, సజ్జాతికులశీలుఁడున నీచవంశ సంభూతుఁడునగు నీ తరుణసైనికవీరునకు సాటివచ్చినవాఁడున్నాఁడా?" అని చెప్పి విలాసకుమారి విషాదముతో రాజమహిషివంకకు ముఖమును ద్రిప్పి మరల నిట్లనియెను. "కాని యిప్పుడు మనము చింతింపవలసినవిషయ మొకటి కలదు—ఇక్కడ నట్టివీరునకు సత్కారపూర్వకముగా బహుమాన మొసంగుమాట యటుండనిండు. ఒక్కసమాదరవాక్యమైన లేకపోయెను! మనమందఱమును వీరరమణులమఁట! మనవీరగర్వమునకుఁ దుదిమొదలు లేదు. మనవీరులను గూర్చియు మనవీరత్వమును గూర్చియు నెంతపొగడుకొనినను మనకుఁ దనివితీఱదు."

రాజమహిషి "ఇప్పుడా కృషికుఁ డెక్కడ నున్నాఁడు?" అని యడిగెను.

విలాసకుమారి నవ్వి అంబాలిక వంకఁజూచుచు "ఆతఁడిఁక నీదుర్గమున నుండుట కవకాశము లేదు. ఆకారణమున నాతఁడు నల్లగొండయున్నషను దీసికొని యెక్కడికో వెడలిపోయెను. పోవునప్పు డాతనికి నల్లగొండకు నేకాంతముగా నేదియో సంభాషణము జరిగినట్లున్నది. నల్లగొండ నడిగినచో సంగతు లన్నియుఁ దెలియఁగలవు." అనియెను.

రాజమహిషి విజయపాలుని దీసికొనిరమ్మనియొక పరిచారిక కాజ్ఞాపించెను. విజయపాలుఁడు వచ్చుచు దూరమునుండియే, గుంపుగాఁజేరియున్నయంగనలను జూచి తనమనసులో "నేనానాఁడు యువనులచేఁజిక్కి శృంఖలాబద్ధుఁడ నైనసంగతిఁదల పెట్టి వీరు నన్నుఁ బరిహాసములాడుటకుఁబిలిచి యుందురు" అనుకొనుచు వారియెదుట రాజమహిషి యుండుటం జూచి యించుక ధైర్యముతో వచ్చి రాజమహిషి కభివందనముచేసెను.

రాజ—ఆకృపీకుఁ డెక్కడ నున్నాఁడు?

విజయ—ఆతఁడు మార్గమధ్యమునుండియే వెడలిపోయినాఁడు.

రాజ—ఆతఁ డెవ్వరు? ఆతనివృత్తాంత మేమైనఁ దెలిసినదా?

విజయ—తలచితలచి యడుగఁగా నాతఁడు తనకు "మీవారు" నందు దుఃఖినియగుతల్లి యొకతె యున్నదనియుఁ దానొకవత్సరమునకుఁ దిరిగి యామెయొద్దకుఁ బోవుటకు వా

గ్దానము చేసితి ననియు, నావతర్సము నిన్నటితోఁ బూర్తి యగుటచే నిక్కడకు రాఁజాల ననియుఁ జెప్పి వెడలిపోయెను.

రాజమ—నీవును శీఘ్రముగా మహారాణాజయసింహుని జూచుటకుఁ బోవలసి యున్నది గాదా? అక్కడకుఁ బోయినప్పుడు నీ వాపీరబాలకుని వృత్తాంతముఁ దెలిసికొనవలయును.

విజయపాలుఁ డంబాలికను జూచి నవ్వుచు "నిశ్చయముగా నేనాతని నిక్కడకుఁ దీసికొనివచ్చెదను. అంబరరాజకుమారి మరల నాతని కొకవిజయమాలికను సంసిద్ధము చేసి యుంచుకొనవలయును" అనియెను.

మూఁడుదినములైనపిమ్మట విజయపాలుఁడు రాణాజయసింహునిఁ జూచివచ్చుటకు నుదయపురమునకు - బయలుదేఱిపోయెను. ఆనాఁడే యంబాలికయు సన్యాసినీవేషము దాల్చి రాజమహిషి యెంత చెప్పినను వినక, యాజన్మబ్రహ్మచారిణియై యుండవలయు నని నిశ్చయించి యొకపరిచారికను మాత్రము వెంటఁ బెట్టుకొని నాథద్వారమునందున్నసన్యాసాశ్రమమునకు వెడలిపోయెను. విలాసకుమారియు నా మెతో వెడలిపోయె నని వేఱ చెప్పనక్కఱ లేదు.

---

## పంచత్రింశపరిచ్ఛేదము.

నాథద్వారమున రాధామాధవాలయమునకు సమీపమునఁ బ్రవహించుచున్నబూనానదీతీరమునందు సన్న్యాసినులిద్దఱునిలిచియుండిరి; ఇరువురును సుందరీమణులు; ఇరువురును యువతీమణులు. ఇరువురును సమవయస్కులు. కాని, వారు ధరించినయుడుపులుమాత్రము వేఱువేఱుగా నుండెను. ఆయిరువురిముఖమండలముల నవలోకించినచో వారికి వేఱువేఱుభావము లున్నట్లగపడుచుండెను. ఒకతె ఖిన్నవదనయై నదీతరంగములపైఁ బ్రకాశించుచున్న యస్తమితసూర్యునిరక్తవర్ణమూర్తిని స్థిరదృష్టితోఁ దిలకించుచుండెను. మఱియొకతె యుజ్జ్వలనేత్రములతోఁ దననెచ్చెలిమోము నవలోకించుచు మెల్లమెల్లగా నేదియో పాడుకొనచుండెను. ఆరమణీమణిని సన్న్యాసాశ్రమమునందు గాక మఱియొకచోఁ గాంచినచో నామె సన్న్యాసిని యని యనఁ గొనఁజాలము. ఆమె ధరించినసన్ననిమెట్టుచీరలోనుండి యామెయొడలిపచ్చనికాంతుల మగపడుచుండెను ఆమెకుటిలకుంతలజాలము వేణీబద్ధమై పాదములపర్యంతము వ్రేలాడుచుండెను. ఆమెపాటలాధరము తాంబూలరాగరంజితమై యొప్పారుచుండెను. ఆమె యంగకములు పుష్పమాలాలంకృతములై పొలుపొందుచుండెను. ఆయున్నతవక్షమున మాలతీహారమును, ఆగురుతరజఘనాగ్రమున నశోకపుష్పకాంచీభూషణమును, ఆకర్ణద్వయమున శిరీషకుసుమములును

హస్తమున లీలాకమలము నలరారుచుండెను. సన్యాసాశ్రమమున నలంకారములు ధరింపఁగూడదు. ఆకారణమున నీసుందరీమణి పుష్పాలంకృతయైనట్లుగపడుచున్నది. ఎవ్వరో బలవంతముగా నామెను సన్యాసాశ్రమమునకు దింపినట్లుతోఁచుచున్నది. కాని, యీమె చెలిమాత్రము వాస్తవికసన్యాసినియే. ఆమె కుసుమకోమలశరీరము కావిచీరచేఁ గప్పఁబడియుండెను. ఆమె పెన్నెరులు చిక్కులుపడి ధూళిధూసరితములై యుండెను. ఆమెవదనచంద్రమండలము విభూతిరేఖాలంకృతమైయుండెను. అయ్యో! పుష్పసుకుమారమగు నాదేహము కఠోరయోగసాధనమును సహింపఁగలదా! విధాత యానవీనసన్యాసినిదేహమును గోమలకనకకమలముచే సృష్టించెనాయేమి?

విలాసకుమారి యాబాలికను జూచి "రాజనందినీ! సన్యాసిని గావలయునను వాంఛ తీఱినది. ఇఁక నడువుము! నిన్నిఁక రాజరాజేశ్వరిగా నలంకరించెదను." అనియెను.

అంబా—సఖీ! నీపరిహాసము లింకను మానవా?

విలా—హాస్యముకాదు చెలీ! ఇదివఱకును నీకుఁజెప్పకుంటిని; కాని, యిప్పుడు చెప్పుచున్నాను వినుము. మనము గిరిదుర్గమునుండి యిక్కడకు బయలుదేఱిననాఁడే విజయపాలుఁడును మహారాణా జయసింహునిదర్శనమునకు బయలుదేఱినమాట జ్ఞప్తియందున్నదా? అతఁడిక్కడ కెందులకేఁగెనో నీవెఱుంగుదువా?

అంబా—అప్రస్తావమునలనఁ బ్రయోజన మేమి?

విలా—చెప్పుచున్నాను వినుము రాజమహిషియరుంధతిదేవి నిన్ను మహారాణాజయసింహునికుమారుఁడగునమరసింహున కిచ్చి వివాహముచేయువిషయమున మాటాడుటకై విజయసింహుని బంపియున్నది. విజయపాలుఁడు వ్రాసినయుత్తరము నాకు నిన్ననే వచ్చినది. దానిం జదివిన వో సంగతులన్నియుఁ దెలియఁగలవు

అంబాలిక విషాదముతో నిట్టూర్పు విడిచి "సఖీ! నేను రాధానాథునిచరణకమలములయందు నాజీవనము నర్పించుకొంటిని. ఇఁక నీమాటలన్నియుఁ నాకెందులకు?

విలా—చెలీ! నీవు నేఁడు సకలప్రపంచమును విడిచి సన్యాసిని వైతివి. కాని నీవెవ్వరిని మఱవవలెనని రాధాశ్యామునాశ్రయించుచుంటివో, యాతనిమీఁది ప్రేమవిశ్వాసములు నీయంతరంగమును విడిచిపోలేదు.

అంబా—సఖీ! నీవెఱుఁగవు. ఆప్రేమము రాధానాథుని యనంతప్రేమతోఁ గలిసిపోయినది.

విలా—(నవ్వి) అందువల్లనే నేను చెప్పుచున్నాను. రాధానాథుఁడు నీహృదయమునందలి యర్ధభాగమును మాత్రమే కైకొనుట కిష్టపడఁడు. నీయల్పహృదయమునందలి యర్ధభాగము నాకృషికయువకుని కిచ్చి శేషార్ధభాగమును రాధాశ్యాముఁడు గైకొనుటకై సమ్మతింపఁబోఁడు, అందులకునిదర్శ

నముగా విజయపాలుఁ శుదయపురిమునుండి వ్రాసినలేఖ నాకర్ణింపుము.

విలాసకుమారి విజయపాలుని యుత్తరము చదువనారంభించెను. “మీవారు మహారాణా నావిన్నప మంగీకరించెను. ఆతనికుమారుఁ డగునమరసింహునకు నూతనసన్యాసిని యైనయంబరరాజకుమారి నిచ్చి వివాహము జరిగించుటకాజ్ఞ యిచ్చెను. ఆమెను శీఘ్రముగాఁ దీసికొనివచ్చుటకై వరునిపక్షమువారు వరునితో నాథద్వారమునకు వచ్చెదరు. వారివెంట నేనును మహాసంరంభముతో ననేకులను దీసికొనివచ్చెదను. ఆకృషికయువకునిగూడఁ దీసికొనివచ్చెద నని రాజకుమారి కెఱిఁగింపుము. రాజకుమారి యాతనికి నొకపుష్పమాలికను సిద్ధముచేసికొని యుండుగాక!

ఇట్లు,

నల్లగొండ యను విజయపాలుఁడు”

అంబాలిక కన్నుల నీరునిండ రాధానాథునిమందిరము నవలోకించుచు “సఖీ! నీవే చెప్పుము? త్రిలోకాధినాథుఁడైన రాధానాథునిచరణదాసిని మర్త్యలోకరాజకుమారుఁ డెవ్వఁడైన ముట్టఁగలఁడా!” అనియెను.

విలా.—(నవ్వుచు) చెప్ప కేమి? ఇంకెన్నో నాళ్ళు లేదు. దాని కేమి? రాజనందినీ! యొకసారి సెలవిమ్ము—ఆగీతగోవింద సంగీతమును మఱియొక్కసారి పాడెదను వినుము.

అంబా.—క్షమింపుము. సఖి! ఇక్కడకు వచ్చినదిమొదలు నీగీతగోవిందసంగీతమువలన నాయొడలు తాపమెత్తుచున్నది.

విలాసకుమారి నగుమొగముతో "సఖి! హే, కేశీమథనముదారం"—అని పాడఁదొడంగెను.

అంబాలిక కోపముతో నక్కడనుండి లేచి మందిరములోనికి వెడలిపోయెను.





శ్రీరాములు

# అమరవిజయము.

మూఁడవభాగము.

## మొదటి ప్రకరణము.

---

నాథద్వారమున విలాసకుమారిని, అంబాలికను బాఠకు లేనాఁడుచూచియుండిరో, ఆనాటికిఁ బదిసంవత్సరముల క్రిందట, వేసవికాలమునందొకనాఁడు పగలు రెండుజాముల వేళ యుదయపురరాజప్రాసాదమున, మహారాణా జయసింహు నిపట్టమహిషి కరుణావతీదేవి విషణ్ణవదనయై తలవాల్చి మంచముపైఁ గూరుచుండి యుండెను. కొన్నినాళ్ళనుండి యామెకు మనస్స్వాస్థ్యము లేదు. ఆమె కేకపుత్రుఁడైన యమరసింహుఁడు పండ్రెండేండ్ల యీడుగలవాఁడు రెండుమాసముల క్రిందట జరిగిన "యాహేరియా" మహోత్సవమున వేటకుఁ బోయి వచ్చినదిమొదలు మనస్స్వస్థత చెడి మలినవదనుఁడై మతిలేక మసలుచుండెను. వేళకు సరిగా భోజనము చేయఁడు.

ఎవ్వరితోడను మాటలాడఁడు; పిలిచినఁబలుకఁడు. ఒకనాఁటి యర్ధరాత్రిమున శయనమునుండి లేచి యొంటరిగాఁ బోయి రాజసముద్రసరోవరతీరమునఁ గూరుచుండెను. రెండుమాసములనుండి రాజమహిషి రాజవైద్యుల నందఱను బిలిపించి యడుగుచున్నను దనయునిచిత్తవికారమునకుఁ దగిన కారణము తెలియదయ్యెను.

చిన్నభార్య యగుకమలాదేవియుఁ గరుణావతీదేవి మంచమున కించుకదూరమున నిలువుటద్దమున కెదుటఁగూరుచుండి తల దువ్వికొనుచు మెల్లఁగాఁ బాడుకొనుచుండెను. ఆమెవెనుకఁ బరిచారిక యొకర్తు నిలిచియుండెను. ప్రమారాజ్య రాజవంశమునఁ బుట్టినకమలాదేవినిగూర్చి చరిత్రములయందు, "అభిమానము గలరాణి; గర్వము గలరాణి" యని నిర్దేశింపఁబడినవిషయము పాఠకు లెఱింగియుండవచ్చును. కమలాదేవి కేశవిన్యాసము గావించుకొని తాంబూలరాగరంజితాధరప్రతిబింబము నద్దములోఁ జూచికొనుచుఁ గరుణావతిని గూర్చి "అక్కా! నీ వెవ్వరిమాటను వినక నీకుఁదోఁచినట్లు జేయుచుందువు గాని నామాట వినినచో నీపాటి కన్నియుఁ జక్కఁబడియే యుండునుగదా!" అనియెను.

కరు—చెల్లెలా! ఏమాట?

కమ—నామాట వినినచోఁ జెప్పెదను. అక్కఱలేని వారికిఁ జెప్పి యరణ్యరోదనము చేయుట యెందులకు?

కరు—చెల్లెలా ! వినవుందువా! అమరుఁడు నాకెట్టికొమారుఁడో నీకు నట్టికొమారుఁడే—అతఁడు నాకనుఁపునఁబుట్టినకుమాటయే గాని నీతనయుఁడు గాఁడా?

కమ—నేనట్లే యనుకొనుచున్నాను. కాని, లోకులట్లనుకొందురా! దాని కేమి—నేఁజెప్పునది వినుము. ఇఁకఁ గాలహరణ మొనరింపక పిల్లవానికి శీఘ్రముగాఁ బెండ్లి చేసితీఱవలయును. ఒకనాఁ డాతని బలవంతముగా నేనడుగఁ దాను రాజసముద్రతీరమునం దొకసుందర బాలికను జూచితిననియు నాఁటినుండియు మన స్సీవిధముగా నున్నదనియుఁ జెప్పియున్నాఁడు. కావున మనము శీఘ్రముగా నొకసౌందర్యవతిని దెచ్చి బిడ్డకుఁ బెండ్లి గావించినచో నాతనికిఁ జిత్తస్థైర్యము గలుగఁగలదు.

కరు—(ఆశ్చర్యముతో) పెండ్లివలననే స్వస్థత చేకూరినచో నింత యాలోచన యెందుకు?

కమ—(అభిమానముతో లేచి నిలిచి) నేను చెప్పునది మీామనసునకు నచ్చదు. ఆసంగతి నేను బాగుగ నెఱుఁగుదును.

కరు—చెల్లెలా! కోపపడకుము. నీవు చెప్పునదే నేనును జెప్పుచున్నాను. వివాహ మైనచో నారోగ్యము గలుగును. కాని, యాతఁడు రాజసముద్రతీరమునందుఁ జూచిన బాలిక నెక్కడఁ దేఁగలము; ఆమె యెవ్వరో తెలిసికొనుట యెట్లు

కమ—అక్కా! మీరిప్పుడే క్రొత్తగా నాకాశము నందుండి దిగివచ్చినట్లుగా మాటాడుచున్నారు. ఆబాలిక గాని చో లోకములో నిఁక సుందరబాలికలే లేరా? ఉదయపుర మహారాణివారికుమారునకు, ఏలోపములేనిసుందరవతి దొరక కనే దొరకదా? సేనాపతి విక్రమసింహునితనయ విలా సకుమారికంటె నందకత్తెను నేనెందును జూచియుండ లేదు. నాతోడు; నామోము చూచియైనను విక్రమసింహుని కుమారిక నంగీకరించి మనబిడ్డకు వివాహము చేసితీరవల యును. మీరుగూడ నామెను జూచియే యుందురేమో?

కరు—లేదు. నేనెప్పుడు నాబాలికను జూచియుండ లేదు.

కమ—ఆహా! ఆమె సామాన్యబాలికయా! ఆమె సాక్షా ద్వీణాపాణి యగుశారద. నేనొకసారి పుట్టినింటి కేఁగున ప్పుడు విక్రమసింహుఁడు నాతో వచ్చుచుఁ దనబిడ్డనుగూడ వెంటఁబెట్టుకొని వచ్చెను. విశేషముగాఁ జెప్పనేల? అక్కా! మాఱుమాటచెప్పక నాకోరిక నెఱవేర్పుఁడు. విలాసకుమారిని మనయమరునకుఁబెండ్లి గావింపుఁడు. ఇట్లు గావించినచో నిఁక నీజన్మమునం దెప్పుడును మీతోఁ గయ్యమాడను—మీమా టను జవదాఁటను.

కరు—విక్రమసింహుని తనయను మనకుమారునకుఁ బెండ్లిచేయుటకు నాకేమియునభ్యంతరములేదు. కాని,రాణావా

రింతచిన్నవయసులోఁ దమకుమారునకు వివాహము గావిం చుటకు సమ్మతింతురా?

కమ—ఆభారము నాపైఁబెట్టుఁడు. రాణా వారంత గుడ్డిగానున్నారా?— బంగారువంటిబిడ్డ దేహము నానాఁటికిఁ గృశించిపోవుచుండుటఁ జూచకయే యున్నారా? అంతమాత్ర మాలోచింపకున్నారా? పెండ్లియైనచో బిడ్డ కారోగ్యము గలుగఁగలదని వారికిఁ దెలియదా?

కరుణావతిమనసులో "వారికట్టిబుద్ధిని బుట్టించుటకునీ వే తగినదానవు" అని యనుకొని, (ప్రకాశముగా) "సరియే; వారు ను సమ్మతింపవచ్చును. కాని, యమరుఁ డందుల కంగీకరించు నా?" అనియెను.

కమ—వలదు—అక్కా! మీకాళ్లకు మ్రొక్కెదను. ఈసుభకార్యమున కడ్డుపెట్టవలదు. నేనిప్పుడే పోయి మహారాణావారి కీసమాచారము మనవిచేసి వారిసమ్మతిని బడసివచ్చె దను.

చంచలబుద్ధియు, సరళచిత్తయు, గర్వస్వభావయునగు రాణి తానుజెప్పినట్లు రాణాజయసింహు నొప్పించి శీఘ్రముగా శుభకార్య మాచరింపవలయునని యోజించి, వేగముగా జయసింహునిశయనగృహమునకుఁ బోయి, బంగారుమంచ ముపై శయనించి నిద్రించుచున్నభర్తను దట్టి లేపి నిద్రాభం గము గావించెను.

———

## రెండవ ప్రకరణము.



అజమీరున కించుక దూరమునఁ గొండపైనొకపురాతన దుర్గముండెను—దాని కిప్పటికిని "అచలగడ"మని పేరు. రాజపుత్రసేనాపతి యగువిక్రమసింహుఁడు కొంతసైన్యముతో నాదుర్గమున వాసము చేయుచుండెను. విక్రమసింహునకుఁ బదునొకండువత్సరముల యీడుగల దేవయానయను కొమార్తె తక్క నితరసంతానము లేదు. దేవయాన వస్త్రభూషణాదుల నలంకరించుటకు విశేషప్రియము గలదగుటచేఁ దండ్రి యామెను విలాసకుమారి యని పిలుచుచుండెను. విక్రమసింహుని భార్య విలాసకుమారిపుట్టిన వత్సరమునందే స్వర్గస్థురాలయ్యెను. భార్య గతించినపిమ్మట విక్రమసింహుఁడు మరల వివాహము గావించుకొనలేదు. అది మొదలు పదివత్సరములకాలము తనబిడ్డను విడువకుండ నాదరముతోడను బ్రేమతోడను బెంచుచుండెను. ఆమె తనపేరు విలాసకుమారి యని యిదివఱకుఁ బాఠకులకుఁ జెప్పియున్నది. రాజపుత్రవీరులు తమపుత్రులకు నభ్యసింపఁజేసెడివిద్య లన్నిటిని విక్రమసింహుఁడు విలాసకుమారికి నేర్పించెను. స్వయముగా సంస్కృతి విద్య నభ్యసింపఁజేసెను. శస్త్రవిద్యనుగూడ స్వయముగా నేర్పుటయే కాక సమయము వచ్చినప్పుడెల్ల నామెను యుద్ధరంగమునకును దీసికొని పోవుచుండెను.

సాయంకాలమున సైన్యాధిపతి సౌధమునఁ గూరుచుం డి యుండెను. విలాసకుమారి తండ్రివెన్నున కానుకొని నిలు చుండి సువాసనతైలము నాతనినరసినతలవెండ్రుకలకు రాచి దువ్వెనతోఁ జిక్కుఁ దీయుచుఁ "బండ్రెండేండ్లబాలునకెంతటి సాహసము! ఆతఁడు పెద్దవాఁడైనచో నెట్టివీరుఁడగునో చెప్పఁ జాలము" అనియెను.

విక్రి.—(నవ్వి) బిడ్డా! నీనోటినుండి యీమాట లెన్ని సారులు వింటిని?

విలా.—అప్పా! మాటిమాటికి నాకాబాలుఁడు జ్ఞప్తికి వచ్చుచున్నాఁడు. ఆ హోరియామహోత్సవమున నీప్రాణముల నాతఁడు కాపాడినాఁడు. అందువల్లనే నాకాతనిపై నంతటిప్రి యము-అడవిపందితో నీవు పెనఁగులాడుచుండఁగా నీచేతిలోని కత్తి జాఱిపడినప్పు డాబాలుఁడు కత్తిపట్టుకొని నీకెదురుగా నిల్వఁబడనిచో నడవిపంది నీపొట్టను జీల్చియుండదా? అప్పా! ఆతని నొకసారి చూడవలయునని యున్నది.

విక్రి.—తల్లీ! దాని కింతటియాలోచన మేల? ఈసారి రాణాను దర్శించుటకుఁ బోవునప్పుడు, కుమారామరసింహుని జూపించెదను. ఇదియేమే తల్లీ! నామోముపై నింతచమురు జాఱుచున్నది?

విలాసకుమారి తెల్విదెచ్చుకొని తండ్రిమోముపైనున్న చమురును దుడుచుచు "అప్పా! అయినచో బయలుదేఱ రాదా? ఈనాఁడే పోయి రాణాను జూడుము." అనియెను.

ఆసమయమునఁ బరిచారిక యొకర్తువచ్చి "రాజమహిషి

కమలావతీదేవి దేవయానను జూడవలయు నని పరిచారికతోఁ బల్లకిని బంపి యుంచెను" అనియెను. విలాసకుమారి యాశ్చ ర్యమునఁ దండ్రి నవలోకించి "రాజమహిషి నన్నుఁ జూచుట యెందులకు?" అని యడిగెను. వృద్ధసేనాపతి నవ్వుచు "నమరసిం హునకు నిన్ను వివాహముచేయుదురని తోఁచుచున్న"దనియెను.

---

మూఁడవ ప్రకరణము.

---

పరిచారిక పల్లకిని వెంటఁబెట్టుకొని కమలాదేవిమహ లునకుఁ బోయెను. కమలాదేవి పరుగెత్తుకొని వచ్చి విలాసకు మారి నెత్తికొని మాటిమాటి కామె మోమును ముద్దాడుచు "నీ విక్కడ కెందులకు వచ్చితివే బిడ్డా?" అనియడిగెను.

విలా—తాము నన్నుఁ బిలిపించినారని.—

కమ—నీవు నన్నెఱుఁగుదువా? నేనెవ్వరో చెప్పుకో చూతము!

విలాసకుమారి యామెయొడినుండి దిగి "మీరు రాణి" అనియెను.

కమలాదేవి విలాసకుమారిని మరలఁ గౌఁగిలించుకొని ముద్దాడుచు "నీమాటలు నాచెవుల కెంతేయింపుగా నున్నవి! నేను రాణినని నీకెట్లు తెలిసినది? నీవును రాణివయ్యెదవా? త్వ రగాఁ జెప్పుము. రాణియగుట నీకిష్టమేనా?" అనియెను.

విలా—ఇష్ట మున్నచో రాణి నయ్యెదనా ?

కమ—నేను నిన్ను రాణిని జేసెదను. అది నీకుఁ దెలియునా? పట్టిరాణి గాదు—రాణులపై రాణి—మహారాణి. ఆసింహద్వారమువంకఁ దిరిగి చూడుము! అక్కడకుఁ బోవుచున్నవా రెవ్వరు ? అతని నెప్పుడైనఁ జూచియుంటివా? త్వరగాఁ జెప్పుము.

విలా—కుమార అమరసింహుఁడు.

కమ—నీ వెట్లెఱుఁగుదువు ?

విలా—మాతండ్రిగారివలన నాయనసంగతి చాలసారులు వినియున్నాను. ఆ పేరియామహాత్మవదినమున మాతండ్రిగారిప్రాణము లాయన కాపాడినారు.

కమ—నిన్నాతని కిచ్చి పెండ్లి చేసినచో నీ వేమయ్యెదవో యెఱుఁగుదువా ?

కమలాదేవి జరుగఁబోవుసంబంధమునుగూర్చి తెలియఁ జేయఁబోఁగా, బాలిక దాసిని గ్రహింపఁజాలక రాణి తనను బరిహాసము చేయుచున్నదని భావించి సిగ్గుచే గన్నుల నీరు పెట్టుకొనియెను.

కమ—అదేమీ ! కన్నుల నీరు పెట్టుకొనుచున్నావు? రాణివయ్యెదవు. చందమామవంటిభర్త దొరకుచున్నాఁడు. ఇఁక విచారమెందులకు? పదునాల్గుజన్మములు తపస్సు చేసినను అట్టి భర్త దొరకునా? అమరుఁడు నీవంకకుఁ దిరిగిచూడ లేదనియా

నీకన్నుల నిరు గ్రమ్మినది? అందులకా యిది? పెండ్లినాఁడు శుభదృష్టిసమయమున నాతఁడు నిన్నెంతటిప్రేమతోఁ జూచు నో నీకే తెలియును.

విలా—శుభదృష్టి యనఁగా నేమి రాణీ !

కమ—మరల నన్ను రాణీ యనుచున్నావా? ఇక్కడ నుండి నన్ను "అమ్మా!" యనిపిలువుము. రాఁబోవుపౌర్ణిమనాఁటిరాత్రి శుభదృష్టి యనఁగా నేమో నీవే తెలిసికొందువు. నేనెంతయో ప్రయత్నించి నిన్నుఁ బిలిపించితిని. ఇటు రమ్ము ! నిన్ను మాయక్క గారిపద్దకుఁ దీసికొనిపోయెదను. నీ చంద్రుని వంటిముఖమును, చుక్కలవంటిపండ్లను జూచినఁగాని యామెకుఁ దెలియదు. అక్కగారివద్దకు వెళ్లినవెంటనే యామెకు నమస్కరింపుము. మఱవవలదు. మఱచినచో మహారాణి కోపగించుకొనును. మహారాణిగారిని దొడ్డమ్మాయని పిలువుము. ఆసంగతి మఱవకుము. నన్ను, అమ్మా యని పిలువుము.

కమలాదేవి విలాసకుమారిచేయి పట్టుకొని పట్టమహిషి మహలునకుఁ దీసికొనిపోయెను.

---

## నాలుగవ ప్రకరణము.

పూర్ణిమారాత్రి—అచలగడమునసలు దెసల జనులు గుంపులుగూడి యుండిరి. అనేకులు వచ్చుచుఁ బోవుచుండిరి

విక్రమసింహుని తనయ దేవయానని చ్చి మహారాజాజయసిం హునికొమారుఁడగు నమరసింహునకు నేఁడు వివాహము గావించెదరు. సాయంకాలమునందే మంగళవాద్యఘోషములు ప్రారంభములయ్యెను. విశేషసంరంభముతో వరునిబంధువర్గమువారందఱును వివాహమండపమునకు వచ్చి చేరిరి. రాత్రి రెండవజామున ముహూర్తసమయ మయ్యెను. రాజపుత్రిసేనాపతి విక్రమసింహుఁడు రాజాధిరాజకుమారునకుఁ గన్యాప్రదానము గావించుటకై యనుపమానానందముతోఁ దనతనయ నంకతలమునఁ గూరుచుండఁ బెట్టుకొనియెను. మహారాజా జయసింహుఁడును దనకొమారుని ముందుంచుకొని సుఖాసీనుఁడై యుండెను. సర్వేశ్వరమూర్తి యగుసాలగ్రామము నచ్చట నునిచి పురోహితుఁడు పవిత్రమంత్రములఁ బఠింపఁదొడంగెను. బాలిక మేలిముసుఁగునుండి తనభవిష్యజ్జీవనాధీశుఁడైన యమరుని ప్రవిమలముఖకాంతిని బ్రేమవికసితనయనములతోఁ జూచుచుండెను. బాలుఁడగునమరసింహుఁడు దనభవిష్యజ్జీవనసహచరివంకఁ జూడఁజొచ్చెను. అతనిముఖమున స్మృతిచిహ్నములు ప్రకటితము లగుచుండెను. వివాహమునకుముందే యాతనిమనసున ననేకసందేహములు పుట్టియుండెను—తనతండ్రి తనకుఁ బెండ్లిచేయుచున్న బాలిక రాజసముద్రతీరమునఁ దానుజూచిన లావణ్యమయియగు బాలికయై యుండదనియుఁ, దనపినతల్లి కమలాదేవి తనను సమాధానపఱచుటకై యస

త్యము లాడియుండవలయుననియుఁ, దాను వివాహమున కంగీకరింప ననుభయమున నసత్యప్రవాదముఁ బుట్టించి యుండవచ్చుననియుఁ, దాను సేనాపతితనయను బెండ్లియాడుట కిచ్చగింపననుసందేహమున నమరసింహుఁడు రాజసముద్రతీరమునఁ జూచియున్న బాలిక విక్రమసింహునితనయయే యను నసత్యప్రవాదము ప్రజలలోఁ బుట్టించినను బుట్టించియుండవచ్చుననియు, నీవిధముగా ననేకము లగుసందేహములు పరంపరలుగా నాతనిమనసున బయలుదేఱెను. కాని, యాసందేహములన్నియుఁ దొలఁగి యాతనిమనస్సునందలిస్ఫురణచిహ్నములు మోమునఁ దోఁచుచుండెను. అమరసింహుఁ డాబాలికను జూచెను. బాలికముఖమండలము మేలిముసుఁగుచేనావృతమై యుండెను. కాని, యామెకాంతిమయశరీరము రాజసముద్రతీరమునఁ జూచియున్న బాలికదేహమువలెనే సుందరలలితసువర్ణలతను బోలియుండెను—అట్లే శరత్కాలశుభ్రసుధాంశుకిరణసదృశవర్ణము— అట్లే చంపకకోరకసమానాంగుళికములు; అట్లే తరుణారుణాబ్జసన్నిభచరణయుగళము; పురోహితుఁడు మంత్రపఠనమును ముగించి వధూవరులకరములను బట్టుకొని వారినంతఃపురమునకుఁ దీసికొనిపోయెను. శుభదృష్టిలగ్నసమయము సమీపించెను. రమణీమణులు వధూవరుల నొండొరుల కుసన్ముఖులుగా నిల్పి మంత్రపూతములైన చీనిచీనాంబరముల నిరువురితలపై నునిచి, బాలికమోముపై నున్న మేలిముసుఁగూడ్చి భార్యాభర్తలు చూచుకొనఁ డని పాడఁదొ

డఁగిరి. బాలిక యరచూపుతో వరునివదనమును జూచి మోము వాల్చుకొనియెను. అమరుఁడు వధువు మోముఁ జూచి చకితుఁడై యించుక వెనుకకు జరిగి నిలుచుండెను; మరల నామె వదనము నొకసారి యాతఁడు తేఱిపాఱఁజూచెను. ఆకస్మికముగా ఘంటానాదమును, రమణీమణులయానందసంగీతకోలాహలధ్వనియు నణఁగిపోవున ట్లమరుఁడు "ఇదేమి, ఈమె యామె కాదు!" అని బిగ్గరగాఁ గేక వైచెను.

"ఇదేమీ, ఇదేమీ! పెండ్లికొడుకు పాఱిపోవుచున్నాఁడు?"

అమరుఁడు వేవేగముగ వచ్చుటినుండి యావలికిఁ బోవుచుండెను. ఆతనిఁ బట్టినిలుపుటకనేకు లాతనివెనుకఁ బరుగెత్తికొనివచ్చిరి. బాలుఁడు కత్తినెత్తి పట్టుకొని "జాగ్రత! ఎవ్వరును నన్ను ముట్టుకొనవలదు" అని గద్దించి పలికెను.

అమరసింహుఁ డీపలికి వచ్చి గుఱ్ఱముపైనున్న రౌతును బడఁద్రోసి యాగుఱ్ఱము నెక్కి యుదయపురమువంకకు వేగముగాఁ బరుగెత్తించుకొనిపోయెను.

---

## అయిదవ ప్రకరణము.

---

దినములు గడిచినవి. మాసములు గడచినవి. వత్సరములు గడచినవి. కుమార అమరసింహునిచిత్తవికార మా

దినమున కాదినము వృద్ధి యగుచుండెను. రాణాజయసిం హుఁడు కుమారునిపై మిక్కిలికోపించెను—అసంపూర్ణమైన వివాహమును సంపూర్ణము గావించుకొమ్మని కొమారున కాజ్ఞాపించెను. రాణికరుణావతి తనబిడ్డ తండ్రియాజ్ఞ నతిక్ర మించినవాఁడగునేమో యనిభయపడి కులపురోహితుని బిలి పించి జరిగినసమాచారము లన్నియు నాతని కెఱింగించెను. పురోహితుఁడు మహారాణావద్దకుఁ బోయి యనేక శాస్త్రేతి హాసవచనముల నుదాహరణపూర్వకముగాఁ జెప్పుచు "బా లుఁడు వయసువచ్చినపిమ్మటఁ దనంతటతానే వివాహము సం పూర్తిగావించుకొని భార్యను బరిగ్రహింపవచ్చును. మీవారు రాజవంశమునందుఁ బుట్టినవారిలో నెవ్వరైన నెప్పుడైన ధర్మపత్నిని బరిత్యజించినవా రున్నారా?" అని చెప్పెను.

ఒకనాఁడు పట్టమహిషి యగుకరుణావతి యొంటిగఁ గూరుచుండి విచారించుచుండెను. కమలాదేవి యామెదగ్గఱి కువచ్చి "ఇప్పుడైనను నేనుజెప్పినట్లు వినినచో మరల విచా రింప నక్కఱలేదు. నామాట వినరాదా?" యనియెను.

కరు—(విసుఁగుతో) మరల ననఁగా నేమి?

కమ—విలాసకుమారిని దండ్రియింటిలోనుండి తీసి కొనివచ్చి కొన్నినాళ్ళు మనయింట నుంచుకొనవలయును. అందువలననైన నమరునిచిత్తము తిరుగునేమో? నేను జెప్పి నది మీకునచ్చుటలేదు కాఁబోలును.

కరు—నీమాట వినుటచేతనే తుద కిట్లయినది.

అభిమానిని యగుకమలాదేవి రోషగర్వములతో "నా మాట వినుటచే నిట్లైనదా? మీరమరునకుఁ దల్లియు, నేను బగదానను నైతినా ? తెలిసినది. కావలయుననియే నేను మీచే నిట్టిచెడ్డకార్యమును జేయించితినిగా! అతిలోకసుంద రిని మీకుమారుఁడు మెచ్చుకొనఁడని నేనను కలఁగంటినా? వేళ్ళులు లెక్కపెట్టుట నాకేమి తెలియును. నేనేమైన జ్యోతి షమెఱుఁగుదునా!" అనియెను.

కరు—జరుగవలసిన దేమియో జరిగియేపోయినది. ఇఁక మీయాలోచనములతోఁ గార్యమేమున్నది?

కమ—(కన్నీరునించుచు) ఆమాట నిజమే. మీరు తొమ్మిదినెలలు మోసి యాతనిఁ గడుపారఁ గన్నవారు. మీరే యాతనికిఁ దల్లి. మేమందఱ మాతనికిఁ బరాయివారమే. నేను మందభాగ్యురాలను. బిడ్డలులేనిగొడ్డుదానను. నామాట విను వారెవ్వరు? ఇఁక నిక్కడనుండుట నాకిష్టములేదు. ఉండఁజాల ను-ఉండియుఁ బ్రయోజనము లేదు. ఇప్పుడే రాణావారి కెఱింగించి నాపుట్టినింటికిఁ బోయెదను. నన్నుఁ బంపివేయుఁ డు. ఉన్నవారినుండనిమ్ము. నేనుండుట భూమికి భారము. ఇదం తయు నాపురాకృతకర్మము! నానుదుట సుఖమువ్రాయలేదు. నవ్వువారియెదుట జాఱిపడ్డట్లయినది నాయదృష్టము!

ఇట్లనుకొనుచు సంతతధారగాఁ గన్నీరుగార్చుచు గమలాదేవి రాణాయొద్దకు వెడలిపోయెను. అక్కడ జయసింహునకును గమలాదేవికిని జరిగినసంభాషణము మనకు వినఁబడలేదు. ఏమి జరిగెనో మనకుఁ దెలియదు. కాని, మఱునాఁడే ప్రభాతసమయమున మహారాణాజయసింహుఁడు రాజ్యభారము మాత్రులపైఁ బెట్టి కమలాదేవితో జయసముద్రమునొద్దనున్న యేకాంతప్రమోదభవనమునకు వెడలిపోయెను. రాజపుత్రసేనాపతి విక్రమసింహునితనయుఁడును యువరాజగు నమరసింహునకును జరిగినవివాహము సాంగము గాకుండ నడుమ నాఁగిపోయినసమాచారము దేశమందంతటను వ్యాపించెను. దానితోపాటు విలాసకుమారి నిరుపమానరూపలావణ్యవిశేషములును లోకప్రసిద్ధి నొందెను. యవనసేనాపతి యఫ్జుల్ ఖానుఁడీజనప్రవాదమునందలిసత్యముఁ దెలిసికొను కుతూహలముతో విక్రమసింహుని దర్శించునెపమున నొకనాఁడచలగడమునకు వచ్చి విలాసకుమారిని జూచెను. విలాసకుమారికవయస్సప్పుడు పదునాలుగువత్సరములు. ఆ యనాఘ్రాతపుష్పము నాఘ్రాణించుటకై యాతనిహృదయము పరితపింపఁజొచ్చెను.

కొన్నినాళ్లైనపిమ్మట నొకనాఁటిరాత్రి విలాసకుమారి తండ్రిగదిలోఁ బరుండి యుండెను. ఆకస్మికముగా విశేషకోలాహలధ్వను లామెకు వినవచ్చెను. ఆ బాలిక లేచి చూచుసరికి

నలుదెసలను ముసల్మానులు శస్త్రపాణులై చుట్టుముట్టి యుండిరి. ఆమె తండ్రిశయ్యదగ్గఱకుఁ బోయి చూచెను ముసల్మానుఁ డొకఁడు రక్తసిక్తమగు కత్తితో నిలిచి యుండెను. ఆపాపిష్ఠి సేనాపతి అఫ్జులు నిద్రించుచున్న విక్రమసింహునివక్షమును గత్తితోఁ బొడిచెను. విలాసకుమారి మూర్ఛితయై నేలపైఁ బడిపోయెను. ఆసేనాపతి మూర్ఛితయైపడియున్న విలాసకుమారి నెత్తికొని పోవుటకై వచ్చుచు గట్టిగా నవ్వెను. దుర్గమునందున్న స్వల్పసంఖ్యాకు లగు సైనికులాచప్పుడు విని మేడమీఁదికిఁ బరువెత్తికొని వచ్చి ముసల్మానులు పైకెక్కియున్న ద్వారమున కడ్డముగా నిలిచి యుండిరి. అఫ్జుల్ ఖాను భయాకులితచిత్తుఁడై మోము ద్రిప్పిచూచుసరికి, కౌపీనధారి యగునొకఫకీరు భయంకరమూర్తిని దాల్చి యెదుట నిల్వఁబడి యుండెను. అతనిదక్షిణహస్తమున సునిశితకరవాలము మెఱసిపోవుచుండెను—విశాలము లగుకన్నులనుండి యగ్ని కురియుచుండెను. బొమముడిపాటుచే ముడివడియున్న యాతనిమోమున జడలగుంపులు దిగజాఱుచుండెను. ఆతని విశాలవక్షమునఁ దెల్లనిగడ్డము వ్రేలాడుచుండెను. అఫ్జుల్ ఖానప్పుడు భయపడి వెనుకంజ వైచి నిలుచుండెను. ఫకీ రఫ్జులును తలవంచి పట్టుకొని కత్తి పైకెత్తి "పాపీ! నాచేతఁ జచ్చుట నీకుఁ దగినదండనముగాదు—పాఱిపొమ్ము." అని గర్జించి పలికెను.

అఫ్‌జుల్ ఖా నూపిరి బిగఁబట్టుకొని పాటిపోయెను. అతి నియనచరు లాభయంకరమూర్తి యగుఫకీరునిఁగాంచి యక్కడ నిలువక దిక్కుదిక్కులకుఁ బరుగెత్తుకొనిపోయిరి. దుర్గసైనికులు "పొడువుఁడు; చంపుఁడు." అని కేకలు వైచుచు వారిని వెన్నంటి పరువిడసాగిరి.

ఫకీరు శయ్యపైనున్నవిక్రమసింహునిదేహమును జూచెను. ప్రాణములు సంపూర్ణముగా దేహమున విడిచిపోయెను. అప్పు డాతఁడు మూర్ఛపడియున్నవిలాసకుమారి నెత్తికొని యటనుండి వెడలిపోయెను. కొంచెముదూర మేఁగినపిమ్మట బాలిక మేలుకని "మా తండ్రి యెక్కడ" నని యడిగెను. ఫకీరు కరుణస్వరముతో "బిడ్డా! నేఁటినుండి నేనే నీతండ్రిని" అనియెను.

---

## ఏడవప్రకరణము.

దినములపై దినములు జరిగిపోయెను. వత్సరములపై వత్సరములు వెడలిపోయెను. రాణాజయసింహుఁడు కమలాదేవితో జయసముద్రప్రమోదభవనమునందే వాసము చేయుచుండెను. స్వల్పకాలమునందే రాథోరుసేనాపతి యగుదుర్గాదాసునిభిధ్యానము రాజస్థానమునం దంతటఁ బ్రతిధ్వనించెను. రాజపుత్రరాజులందఱొక్కరొక్కరుగావచ్చి యారా

వళీపర్వతము నెక్కి దుర్గాదాసు నాలింగనము చేసికొనిరి. సమగ్రభారతవర్షమున కధీశ్వరుండును, రాజకులశ్రేష్ఠుండు నగుమీవారురాణామాత్రము మహాత్మమందిరమునకు వచ్చి, యీమహావ్రతమున దీక్షితుండు గాలేదు. అచ్చటికిం జేరి యున్న రాజపుత్రవీరులందఱు గోలపెట్టుచు మహారాణాయొద్దకు విన్నపమంపుకొనిరి. కాని, వారి రోదనము లాదుర్దినములలో రాణాచెవుల కెక్కలేదు. రాజపుత్రవీరు లందఱు నాకారణమును దెలిసికొనంగోరి రాజమహిషియైన కరుణావతీదేవివద్దకు—జయపురరాజసౌధమునకు దూత నంపికొనిరి. దూతవలన సమాచార మంతయు విని కరుణావతీదేవిహృదయము కరంగిపోయెను. దూత వెడలిపోయినపిమ్మటం గరుణావతి కుమారునిం బిలిచి కన్నీరు గార్చుచు "హా! వత్సా! అమరా! బాప్పారాయలవంశమునకు నేఁడు వచ్చియున్నకళంకమును బోంగొట్టు వా రెవ్వరు?" అనెను.

అమ—తల్లీ! ఆజ్ఞయైనచో దాసుఁడు పుణ్యప్రదమగునీయుద్ధమునందు ప్రాణము లర్పించి యీమీవారుగౌరవము నిలువంబెట్టఁగలఁడు.

కరు—బిడ్డా! నిన్నొంటిగా నంతదూర మెట్లు పంపఁగలను?

అమ—తల్లీ! ఒంటరిగా నెందులకు? సైన్యమంతయుం జాలదినములనుండి యవనరక్తపానమునకై యాత్ర పడుచు

న్నది; ఇంగితమాత్రమున జరుగనున్న పుణ్యావయవముగునీమహా యుద్ధమున దుమికి నిరుపమానశౌర్యవీర్యపరాక్రమములు చూపి ప్రపంచమునంతను నాశ్చర్యపెట్టఁగలదు.

కరు—(గర్వసంభ్రమములతో నిట్టూర్పు విడిచి) వత్సా! రాజాజ్ఞ లేనిదే సైన్యమును యుద్ధమునకుఁ గొంపో యినచో మహారాణాకును, కమలాదేవికిని గోప మినుమడిం పదా?

అమ—(చేతులు జోడించుకొని) తల్లీ! అయినచో నాకాజ్ఞ యిమ్ము. నేనొక్కఁడనే పోయి వచ్చెదను.

కరుణాదేవి కన్నీరు నించుచు "భగవానుఁడా! మీవారు మహారాణాకుమారుఁ డిప్పుడు యవనయుద్ధమున కసహా యుఁడై పోవలసి వచ్చినదా" యనుకొని తనయునిఁ జూచి "వత్సా! ఆలసించినఁ బ్రయోజనము లేదు. ఈరాజకుమార వేషమును దీసి పారవైచి నేలను దున్నుకొనుబీదరైతువేష మును వేసికొనుము" అనిచెప్పెను.

ఆవీరమాత కన్నీరు చెఱఁగుచేఁ దుడుచుకొనుచుఁ దన చేతులతోడనే కుమారునకుఁ గృషిక వేషము వేసి "వత్సా! బయలుదేఱుము. నిన్నాశీర్వదించుచున్నాను—ఈసురాసుర యుద్ధమున నీక్షత్రియశౌర్యమును జూపి భూమిని బ్రకాశిం పఁజేయుము. అనాథనాథుఁడగు జగన్నాథునికరుణచే నీవు ప్రాణములతో నున్నయెడల నొక సంవత్సరమైనపిమ్మటఁ దిరిగి

వచ్చినన్నుఁజూడుము." అనియెను. కృషికవేషధారియు, రాజాధిరాజకుమారుఁడు నగునమరసింహుఁడు జననీచరణకమలములకు సాష్టాంగనమస్కారమొనరించి యామెపాదధూళి శిరమున ధరించి యొకగుఱ్ఱమును, ఒకకత్తిని మాత్రము తీసికొని రాజప్రాసాదము విడిచిపోయెను.

అకటా! ఇప్పుడాదినము లెక్కడకుఁ బోయినవి. ఇప్పుడాకాలపుసత్యచరిత్రము నాఖ్యాయికారూపమున వ్రాసినను నది యసంభవమనియు, హాస్యజనకమనియు నెంచఁగల దినములు వచ్చినవి. హా విధీ! భారతభూమి కీస్థితికిఁ దేవచ్చునా?





శ్రీరాములు.

# అమరవిజయము.

నాల్గవభాగము.

## మొదటిప్రకరణము

మహారాణాజయసింహుఁడు తన విశ్రామభవనమున నుచితాసనముపైఁ గూర్చుండి యుండెను. ఎదుటిదంతపుమంచముపై విజయపాలుఁడు గూరుచుండి యుండెను. విజయపాలుఁడు దూరపుసంబంధమున రాణాజయసింహునకుఁ జెల్లెలి పెనిమిటియై యుండెను.

రాణా—నీవు చెప్పిన దంతయుఁ దెలిసినది. కాని, మొదటివివాహము పూర్తి గాకుండ మఱియొకవివాహముఁ జేయుట శాస్త్రసమ్మతము గాదు.

విజ—(నవ్వి) మన్నించినచోఁ దమ్ముల నొకసంగతి యడుగఁదలఁచితిని.

రాణా—ఏమో చెప్పుము.

విజ—మహారాణావారికి శాస్త్రములపై నింతటి యచలభక్తి పుట్టి యెన్నినాళ్లైనది?

రాణా—ఏమియా?

విజ—పిల్లి కన్నులుమూసికొని పాలుద్రావుచుగాదా! కరుణావతీదేవి యనుజ్ఞలేకయే కమలాదేవిని భుజములపై నెక్కించుకొనుటకు శాస్త్రము సమ్మతించినది గాదా? బాలుఁడైనకుమారునిపైఁ గోపించి యేడువర్షములకాల మజ్ఞాతవాసమునం దుండి కమలాదేవిని దక్క యేనరప్రాణిమోమును జూడకుండుటకు శాస్త్ర మంగీకరించినది గాదా?

ఇట్లు చెప్పి ప్రత్యుత్తరము నపేక్షింపకయే విజయపాలుఁ డక్కడనుండి వెడలిపోయెను. గది కవ్వాలద్వార పార్శ్వమున "రాఁగూడదా, అక్కా! నేనుకూడ నుండఁగా భయమేమి?" అనుమాటలు వినఁబడియెను.

కమలాదేవి కరుణావతి చేయిపట్టుకొని లోపలికి వచ్చి రాణావంకఁ జూచి "మహారాజా! ఇంతలో నెంతయో జరిగినది. నాకేమియుఁ దెలియదుగదా! (కరుణావతివంకఁజూచి నీవు చెప్పరాదా అక్కా?" అనియెను.

రాణా—దేవీ! విజయపాలునివలన నంతయు వింటిని.

కమ—ఆసంగతి వింటిమి. కాని, దానికుపాయ మేమాలోచించితిరి?

రాణా—దేని కుపాయము?

కమ—దేనికా? దేనికో నీూరింతవఱకు నెఱుఁగనే

యెఱుఁగరా?—అక్కా! వింటిరా? మీరాయనను జాలదొడ్డ వారని చెప్పుచుందురు. వారిబుద్ధి మొదట నెట్లున్నదో యిప్ప టికి నట్లేయున్నది—మహారాజా! తమయంతరంగమునఁ బ్రేమ యనుమాటయే లేదా? మనబిడ్డ యమరుఁడు సంవత్సరకాల మునం దనుభవించినకష్టములు చెప్పినఁ దీఱునా? ఇంతకాల మైనపిమ్మటఁ జేయిజాఱిపోయినరత్నము దొరికినపిమ్మట నాతని యాశను దీర్పఁగూడదా?—అక్కగారు చెప్పినట్లే బ్రహ్మ మగవారిమనస్సును గఠినశిలతో నిర్మించినాఁడు గాఁబోలును! దానికేమి లెండు! మీకు ఖండితముగాఁ జెప్పుచున్నాను—సాధ్యమైనంత వేగముగా నమరున కంబరరాజకుమారి యంబా లిక నిచ్చి పెండ్లిచేయుట మంచిది.

రాణా—అయినచో, ఒకవివాహము సాంతము గా కుండ మఱియొకవివాహమునకుఁ బ్రయత్నము చేయుట మీ కిష్టమగునా ?

కమ—అది నాయపరాధము. నేను బలవంతముగా విక్రమసింహునికొమార్తెను దెచ్చి పెండ్లి చేసితిని. అప్పు డమరుఁడు రాజసముద్రతటాకతీరమున జయపుర రాజనందినిని జూచి ప్రేమించె నని యీమందబుద్ధి యేమెఱుంగును? అయ్యో! బుద్ధిహీనురాల నగు నేను మిమ్ము బలవంతపఱచి కమ లమీరునకుఁ గొనిపోకున్నచో మనబిడ్డ యమరుఁడు దరిద్రు నివలెఁ గృషికవేషమున ససహాయుఁడై యవనయుద్ధమునకుఁ

బోయియుండునే! (అనిచెప్పుచుఁ గన్నీరు గార్చుచుఁ గమలా దేవి రాణాచేయి పట్టుకొని) "అక్కగారు నాయపరాధము లు మన్నించినారు. మహారాజా! యిప్పుడు మాయిరువురికోరి కను దీర్పవలయును. అమరునిమనసు బాగుపడినపిమ్మట నాతఁ డు విలాసకుమారిని గూడఁ దనయొండకుఁ దెచ్చుకొనును— కాదా, అక్కా! మీరు చెప్పఁడు!" అనియెను.

రాజు కరుణావతీదేవిని జూచుచు "జయపురరాజకుమా రిని దెచ్చి యమరున కిచ్చి మరలవివాహముగావించుట నీకును సమ్మతమే గద!" అని యడిగెను.

రాజ్ఞి ముసిముసినగవుతోఁ గమలాదేవిని జూచి "మహా రాజా! ఒకధర్మపత్ని యుండఁగా మరల దారపరిగ్రహణము సేయుట యీరాజవంశమునకుఁ గ్రొత్త గాదు. తామీపద్ధతి నిందనీయ మని మొట్టమొదట ననుకొనలేదు" అనియెను.

రాజప్రతిభుఁడయ్యు గంభీరభావము వహించి "మీ యందఱ కేదిసమ్మతమో యట్లు గావించుటకు నాయభ్యంత రము లేదు." అనియెను.

కమ—అక్కా! నామనసులోనికోరిక లన్నియు మహా రాజుగారికి విన్నవింపనా?

కరు—స్పష్టముగా విన్నవింపుము.

కమ—సావధానమనస్కులరై వినవలయును. మహా రాజా! మీరట్లుమనసిచ్చి వినకున్నచో నవమానపడుటకంటె

నూరకుండుట మేలు. అంగీకరింతుమని సెలవిచ్చినచో విన్న వించుకొందును.

రాణా——ఇంతవఱకు నేను నీకోరిక లేవి నెఱవేర్ప లేదు?

కమ——మహారాజా! ఈవివాహము విశేషమహోత్సవముతో జరిగింపవలయును. రాజస్థానమునం దింతటి వివాహమహోత్సవము నెవ్వరు నెప్పుడుఁ జేసియుండఁగూడదు. చూచియుండఁగూడను. అమరుని బీదరైతుని జేసి యవనయుద్ధమునకుఁ బంపినదుఃఖము నివారణ మగుటకు నాయిష్టప్రకార మనేకమహోత్సవములు సమారంభమున జరుపవలయును. రాజస్థానమునందలి సకలరాజపుత్త్రులకును——రాజపరివారమునకును లగ్నపత్రికల నంపవలయును. ఎల్లరను బిలువనంపవలయును.

రాణా——మంచిది. మఱి యేమి కావలయును?

కమ——అయిదువందలయేనుఁగులతోను, బదివేలగుఱ్ఱములతోను, అసంఖ్యజనసమూహముతోను "వరయాత్ర"కు బయలుదేఱవలయును. మాపుట్టినింటినుండి "దిగ్గజ" మనుపట్టపుటేనుఁగును "దానవదమన"మనురాజాశ్వమును దెప్పింపవలయును. ఈయేనుఁగు లన్నియు గుఱ్ఱములన్నియు ముత్యాలహారములతోడను, వజ్రాలభూషణములతోడను నలంకరింపఁబడవలయును.

రాణా—దేవీ! ఇప్పుడు రాజస్థానమునందు యవనదండయాత్రలచే మనకు మిగిలియున్న భాగ్యము గుఱ్ఱములు నేనుఁగులుగాక మఱేమి గలదు? కాని, ముత్యములును, వజ్రములు నెక్కడనుండి తేఁగలము?

కమ—(గర్వముతో లేచి నిలిచి) ఏమియనుచున్నారు? ఎక్కడనుండి తేఁగలమనియా? మహారాణావంశమున జన్మించితిరి గాని, బీదవంశమునఁ బుట్టలేదే! ఇందుకొఱకే—ఇట్టియవమానము సహింపలేకయే యెప్పుడు మీయొద్ద నాకోరికలు వెలిపుచ్చనేలేదు.

పట్టమహిషి కరుణాదేవి, కమలాదేవిచేయిపట్టుకొని యామెచెవిలో నేమియో చెప్పెను. కమలాదేవి రాణాయొద్దకుఁ బోయి కూరుచుండి మరల నిట్లనియెను. "అక్కా! బాగుగాఁ జెప్పితిరి. తొందరచేయుటవలనఁ బ్రయోజన మేమి? దానికేమి—మహారాజా! మాపుట్టినింటినుండి దిగ్గజమును, దానవదమనతురంగమును దెప్పించెదను. వానికైనను ముక్తామణిహారము లలంకరింపనగునా?"

రాణా—కావచ్చును.

కమ—నాథద్వారగోపురమునకుఁ బసిఁడికుండ నెత్తింపవలయును. అమరు నమూల్యవజ్రఖచితభూషణాంబరముల చే నలంకరించి వివాహమునకుఁ దర్లి వెళ్ళవలయును. చాలదినములనుండి నాకొకకోరిక గలదు. అదియును జెప్పెదను.

రాణా—ఏమియో చెప్పుము.

కరు—పూర్వకాలమున, మాపితృవంశమున రాజకిరీటములఁ బ్రకాశించెడిలోకదుర్లభమైన "కోహినూ" రను మహారత్నమును యవనులనుండి మరలఁ దెచ్చియిచ్చెదమని తాము వాగ్దానము చేసియుంటిరిగదా! మీరారత్నముఁ గళ్యాణమహోత్సవమునకు ముందుగాఁ దెప్పించినచోఁ బెండ్లికుమారుఁడైన యమరునిలలాటమున దాని నలంకరింప నగును.

రాణా జయసింహుఁ డెట్టిప్రత్యుత్తరము నీయక నిట్టూర్పు విడిచెను. కరుణావతీదేవి కమలాదేవిచెవిలో మరల నేమియో యేకాంత మాడెను. కమలాదేవి మరల నిట్లనియెను. "ప్రస్తుత మది యొకవిధముగా నసంభవమే యగునని నే నెఱుంగుదును. కాని, మనమింతటియుల్లాసముతోఁ జేయుచున్న మహోత్సవమునందు, అమరునిలలాటమునఁ గోహినూరు నలంకరించినచో మా కోరిక ఫలించును. ఆమాట యటుండనిమ్ము. మహారాజా! నల్లగొండ తమతో నంతసేపటివఱకు నేమేమిమాటలాడెను?"

గదివెలుపల గవాక్షపార్శ్వమునుండి యెవ్వరో గట్టిగా నవ్వి "అమరుఁడు నిజముగా రాజకుమారుఁడో, కాక కృషికకుమారుఁడో తగినదృష్టాంతములఁ జూపవలయు నని నల్లగొండ యడుగుచున్నాఁడు" అని చెప్పినట్లయ్యెను.

## రెండవ ప్రకరణము.

నాథద్వారమునందు జరుగఁబోవువివాహమునకు వరు నిపక్షమువారు త్వరితవెళ్లునమయ మయ్యెను. రాణాజయసింహుఁడు చెప్పినట్లు యువనదండయాత్రలచేననఁగఁద్రొక్కఁబడినరాజస్థానమునకు మిగిలియున్న మహాభాగ్యము గుఱ్ఱములు నేనుఁగులు మాత్రమే. నేఁటికి రెండువందలసంవత్సరములు జరగిపోయినను, సర్వస్వమును బోయి పట్టిదెయున్న రాజపుత్రస్థానమునందు, లోపించియున్నగౌరవభస్మావశేషమున, నారిపోయిననిప్పుబొగ్గులవలె గుఱ్ఱములు నేనుఁగులుమాత్రము విశేషముగాఁ గనఁబడుచుండెను.

కమలాదేవియాజ్ఞాప్రకారము నిమిషములోఁ దేజోగర్వశీలములు, రణకుశలములు, సుందరములు నగుపదివేలగుఱ్ఱములు హేషారవములతో నృత్యములుసేయుచు వచ్చి రాజప్రాసాదప్రాంగణమునందు వగుసలు దీరి నిలుచుండెను. వాని వెనుక మహోన్నతములును, మహాబలాన్వితములు నగు నేనూఱేనుఁగులు గంభీరగమనములతో వచ్చి ప్రాసాదనిమ్నభాగమున నిలుచుండెను. కమలాదేవి కోరికప్రకారముగా నామె పుట్టినిల్లగు ప్రమారాజ్యరాజభవనమునుండి "దానవదమన" మనురాజాశ్వమును, "దిగ్గజ" మనుపట్టపుకేనుఁగును గూడ వచ్చియుండెను. నిరుపమానతేజస్ఫూర్తులు గల "దానవదమ

నము” ముక్తామణిగణాలంకృతమై నృత్యముచేయుచు వచ్చి ప్రాంగణమునకు ముందటిభాగమున నిలిచెను. దానితో, గంభీరమూర్తియగు“దిగ్గజము” నాల్గువైపులకుఁ దుండమునుద్రిప్పికొనుచు వజ్రభూషణకాంతులఁ బ్రసరింపఁజేయుచు రాజగాంభీర్యముతో ముందఱికివచ్చి నిలిచెను.

కమలాదేవి ప్రహర్షనయనములతోఁ బ్రాంగణముల వంకఁ జూచి పిమ్మట నమరసింహునకు వరాలంకారములఁగై సేయవలయు నని యాతనిఁ దెచ్చి కూరుచుండఁబెట్టి పట్టమహిషికి రమ్మని వర్తమానమంపెను.

రాజమహిషి కరుణావతీదేవి యీయానందమహోత్సవసమయమునఁ దనగదిలో నొంటరిగాఁ గూరుచుండి విషణ్ణవదనముతో నొకయుత్తరమును జదువుచుండెను. వెనుకటిరాత్రి నాథద్వారమునుండి పరిచారికయొకర్తు లేఖ నొకటిఁ దెచ్చి యిచ్చెను. రాజమహిషియించుకసేపు చింతాక్రాంతయైయుండి క్రిమ్మఱ లేఖను విప్పి యిట్లు చదువఁదొడంగెను.

“రాజరాజేశ్వరీ! తనపుత్రుఁడు కుమారామరసింహుఁడొకసన్యాసినిని బెండ్లియాడుననియు, అతిశీఘ్రముగా మహాసంరంభముతో నాథద్వారమునకు వచ్చుచున్నాఁడనియు వినియున్నాను. ఆజన్మ[illegible]ని యగునీయంబరరాజకుమారి యంబాలిక రాధాశ్యామునిచరణము లాశ్రయించిననాఁడేపవిత్రాశ్రమమునకై మనుష్యుల కధికారముండు నని స్వప్నమునందును

దలంపలేదు. రాజాధిరాజగుజయసింహుఁడు దయాధర్మములకు జలాంజలి యిచ్చి స్వయముగా వచ్చి, సర్వసంగపరిత్యాగిని యై యున్న యీసన్యాసినిని రాధానాథునిచరణములనుండి బలవంతముగా నపహరించుకొని పాఱిపోవుటకు సంకల్పించుకొనె నని విని యాశ్చర్యమొందుచున్నాను. ఈజగన్నాథునకు దాసియైనయీమె పరనాథుని దలయెత్తియైనఁ జూడఁగలదా? కాని, మీరు మహారాణాను నిష్ఠురమును, పాపమయము నగు నీదురభిసంధినుండి తప్పింపఁజాలరా? అట్లు చేయఁజాలనిచో వరాలంకారుఁడై మహాసంరంభముతో నాథద్వారమునకు వచ్చుమీతనయుఁడు రాధాశ్యామునిచరణకమలముల యందుఁ బ్రాణముల నర్పించినసన్యాసిని యగునంబాలికను జూడఁగలఁడని నిశ్చయముగఁ దెలిసికొనవలయును. తల్లిదండ్రులు లేని నిస్సహాయురా లగునంబరరాజకుమారిక ప్రాణములను గాపాడుటకు మీకిష్టమున్నచో నిపుడైన మహారాజును వివాహప్రయత్నమునుండి నివృత్తునిఁ జేయవలయుననుటయే నాభిక్ష. "ఇట్లు సన్యాసిని. అంబాలిక."

కరుణావతీదేవి యాలేఖను జదివి హతాశయు, మర్మాహతహృదయయునై చింతించుచున్నసమయమున ద్వారముఁ దెఱచుకొని కమలాదేవి గదిలోనికి వచ్చెను. ఆమె యాశ్చర్యముతోఁ గరుణాదేవిమోముఁ దిలకించి "అక్కా! వ్రాయుటకును జదువుటకు నిదియా సమయము? అమరునకు వరాలంకార

మునిమిత్తము మాపుట్టినింటినుండి తెప్పించినసొగసైనవస్తుల ను మీకుఁ జూపింపలేదు. చూచుట కిష్టమున్నచో వేగముగా నా వెంట రండు!" అనియెను.

కమలాదేవి ప్రత్యుత్తరమున కవకాశ మీయక బల వంతముగాఁ గరుణావతిచీరచెఱఁగును బట్టుకొని, తనగదిసమీ పమునం దున్న పుష్పోద్యానమునకు బలవంతముగఁ దీసికొని పోయెను.అచ్చట ననేకాంగనలు అమరునిచుట్టు నిలిచియుండిరి. కమలాదేవి నవ్వుచు ననుపమానందముతో స్వయముగ నిరు పమానానర్ఘరత్నశోభితములగునుడుపులను గుమారునకుఁ దొ డిగి, వజ్రఖచితమగుతురాయిగల యుష్ణీషమునుదలయందుంచి రమణీమండలమును సంబోధించి "మీరంద ఱు తెప్ప వాల్పక చూడుఁడు. భువనమోహనుఁ డగునిట్టి పెండ్లికుమారుని లోకమునం దెచ్చటనైనఁ జూచియున్నారా? నేను మొదటఁ జెప్పినట్లుగా నంబరరాజకుమారి యిట్టివరునిఁ బడయుట కెన్ని యో జన్మముల నెంతయో తప మాచరించెననుట నిజమో కల్లయో యోజించి చెప్పుఁడు! కాని, యొక్క విషయమున మాత్రము దైవము నాయాసను దీర్పలేదు. ఈనాఁడిట్టిసుఖసం లో ఁయునందు మాతండ్రివంశమునకు గౌరవధనమైన "కోహినూరు" రత్నమును బిడ్డని కలంకరింపఁగల్గినచో నాయాశయంతయుఁ బూర్తియై యుండును"అనియెను.

కుమారామరసింహుఁడు దలవంచుకొని లజ్జతోఁ "దల్లీ!

కొహినూరు, రత్నమును దెచ్చి మీకోరికను దీరిచెదను." అనెను.

---

మూఁడవ ప్రకరణము.

---

కాళిందీనదీతీరమున ముసల్మానుమందిరమున వృద్ధఫకీరు నేలపైఁ గూర్చుండియుండెను. ఆతని యెదుట నొకకంబళముపై దుర్గాదాసు కూరుచుండి యుండెను. దుర్గాదాసుని కెంపువాఱినకన్నులనుండి యశ్రుధారలు గురియుచుండెను. దుర్గాదాసు కన్నీరు దుడిచికొని ఫకీరునిముఖమండలమునుజూచుచుఁ జేతులు జోడించుకొని. "స్వామీ! ఇన్నినాళ్లైనతరువాత మీవాక్కునుండి యీకఠినవాక్యములను వినవలసి వచ్చెనా?" అనియెను.

ఫకీ—వత్సా! విధివిధానము నుల్లఘించుట మనుష్యునకు సాధ్యముగాదు. అందువలనఁ గొంతకాలమువఱకు యవనయుద్ధమునుండి విరతుఁడవు గావలయు నని చెప్పితిని. ఈకొలఁదికాలపుయుద్ధములలో బహుసంఖ్యాకులైన హిందూవీరులు కాలాధీనులై గతించిరి. ఇప్పుడీరక్తప్రవాహము నిలుపుట యావశ్యకము. యోధపురరాజబాలకుని శైలశిఖరమునందేకాంతముగా నుంచియుండుట యనవసరము లేదు. ఔరంగజీ బిప్పుడు కోఱలుదీసినపామువలె నున్నాఁడు. కావున నబ్బా

లకుని స్పృశించుట యిఁక నాతని కవశ్యముగాదు. నాయిహజీ వనము ముగియవచ్చినది. జీవనము పోవుటకు ముం దీరక్తప్రవాహ మాఁగిపోవుటను జూచి సుఖముగా దేహమును జాలింతును.

దుర్గా—(కన్నీరునించుచు) "విధాత కిది యేమి సంకల్పము? నేను దీనిని విశ్వసింపఁజాలకున్నాను. సకలజగదధీశ్వరుఁడైనవాఁ డంతటినిష్ఠురుఁడా? ఆతనిమంగళమయవిధాన మిది యేనా? హా, దేవా! తుదకీనిష్ఠురాలోచనవాక్యములు మీనోటినుండి వినవలసివచ్చెనా? యవనసంహారమహావ్రతమునకు జలాంజలి యిచ్చి దుర్గాదాసుఁ డింకను జీవితములు ధరింపవలయునా? బంగారువంటి భారతవర్షము నానాఁటికిఁ బాతాళమునఁ గూలిపోవుచుండుటఁ గన్నారఁగాంచుచు నిశ్చింతుఁడనై యూరకుండవలయునా? ఓయోగివరా! త్రికాలదర్శీ! అనంతజ్ఞాన స్వరూపా! మీరు దివ్యజ్ఞానులైనను మీకఠినోపదేశమును దుర్గాదా సంగీకరించుట యసంభవము" అని చెప్పి బాలునివలె నేడ్చుచుఁ జేతులు జోడించుకొని బాష్పగద్గదకంఠుఁడై మరలఁ జెప్పఁ దొడంగెను.

"తల్లీ! భారతభూమీ! నిఖిలభువనాధీశ్వరీ! అగణ్యదేవతా మాతృస్వరూపిణీ! ససాగరవసుంధరా శిక్షాదాయినీ! రాఘవార్జునులను, వాల్మీకివేదవ్యాసులను, సీతాసావిత్రిపదులను గన్నతల్లీ! నీయదృష్టము తుదకిట్లయినదా? దేవీ! యొకసారి

కనువిచ్చి చూడుము! నీకధిష్ఠానమైయున్న భారతభూమి శ్మశానముగాఁ బరిణమించినది! ఈసమయమున సుధామధురములగు నీహుంకారధ్వనుల నింకొకసారి వినఁజాలనా?"

ఫకీ—వత్సా! ఊరడిల్లుము! భారతవర్షము నావరించుకొనిన యీయంధకారము స్థిరముగా నుండఁజాలదు. ధర్మమునకు విజయమును బాపమునకుఁ బరాజయము నెప్పటికైనఁ దప్పవు. ఇది యలంఘ్యవిధివిధానము. వీనిని భారతనివాసి ప్రత్యక్షముగాఁ జూచితీరును.

దుర్గా—హా, స్వామీ! గురుదేవా! ఆదినములు మరెప్పుడు చూడఁగలము?

ఫకీ—ఇప్పుడు మనము చూచుచున్నదానినిబట్టి గోచరించుట లేదా! మహాపాతకుఁడైన యౌరంగజేబుని మూర్ఖతవలన నప్పటి ముసల్మానురాజ్యము ధ్వంసమగుట కిఁక నెంతియో విలంబము లేదు. యవనసార్వభౌముఁ డింక దక్షిణమునుండి ముసల్మానురాజధానికి వెనుదిరిగి రాఁజాలఁడు. స్వల్పకాలమునందే యీయవనసామ్రాజ్యము భారతభూమినుండి నిర్వాసితము కాఁగలదు. పిమ్మట, మీశాస్త్రములయందుఁ జెప్పఁబడినట్లే బహుదూరమునుండి, మహాసాగరమును దాఁటి నిరుపమజ్ఞానసంపన్నులును నిర్వక్రపరాక్రమశాలురును, ధర్మపరాయణులు నగు వేఱొకజాతివారు విధాతృనిమంగళమయసంకల్పానుసారముగా భారతభూమికివచ్చి పడిపోవుచున్న భా

రతవర్షము నుద్ధరించుటకు దీక్ష వహించెదరు. ఔరంగజీ బవలంబించిన భ్రమాత్మకమగు రాజనీతి భావికాలమున నీవి శాలభరతఖండమునకు రాజులగువారికిఁ జాలకాల మనుసరణీ యముగా నుండఁగలదు.

దుర్గా—నేనందాఁక నిశ్చేష్టుఁడనై, నిశ్చింతుఁడనై యు వనపరిచర్యలలోఁ గాలము గడపవలసినదే !

అంతలో సామీప్యమునం దాకస్మికముగా వివిధవాద్య ముల గంభీరధ్వనులును, ననేకజనుల యానందకోలాహల ధ్వనులును వినవచ్చెను. దుర్గాదా సాశ్చర్యముతో "నిది యేమి! ఈదుఃఖసమయమున నీయానందకోలాహలధ్వను లెక్కడనుండి వచ్చినవి?" అనియెను.

ఫకీ—(నవ్వుచు) వత్సా! చాలకాలమునుండి మనము రక్తప్రవాహామయమగు భయంకర సంగ్రామరంగమున విషా దకరభీషణాభినయమును బ్రత్యక్షముగాఁ జూచుచుంటిమి. ఇప్పుడు రమ్ము. తుట్టతుదకుఁ బ్రేమమయమగు నేఁటి యీ యానందోత్సవమునఁ జేరి పోవుదము.

అగణితజనానందమయకోలాహలధ్వనులును, వివిధ వాద్యగంభీరనినాదములును, బహుగజతురంగపదఘట్టనధ్వ నులును ఫకీరునియానందమయమధురకంఠస్వరముతోఁ జేరిపో యెను. అందఱకంటెను ముందుగా విజయపాలుఁడు కుమారా మరసింహుని చేయిఁ బట్టుకొని వచ్చి ఫకీరున కభివాదనము

చేసి, దుర్గాదాసును గూర్చి "మీరీతని నెఱుంగుదురా? రైతు గర్భమున రాజకుమారుఁడు పుట్టుట యిదివఱ కెవ్వరైన నెఱుంగుదురా!" అనియెను.

నాలుగవ ప్రకరణము.

వైరాగ్యవ్రతమునుబూనిన సన్న్యాసినులకు శాంతిమయాశ్రమమై, రాధానాథనికేతనమై యొప్పుచున్న నాథద్వారము నేఁడాకస్మికముగాఁ గోలాహలమయమగు రాజధానిగా మాఱిపోయెను. ఆలయమునకు సమీపమున ననేకశిబిరములు స్థాపింపఁబడియెను. వానికి నలుదెసల నున్న సైన్య సమూహములలో ననేకరాజుల యుష్ణీషములు వెన్నెలవెలుఁగులలో మిలమిల మెఱసిపోవుచుండెను. ఆకస్మికముగా నేదియో మోహమంత్రప్రభావముచే సంసారత్యాగులై యున్నవిరాగజనులందఱును దమచిరసన్న్యాసవ్రతమును మఱచి నేఁడు సంసారకోలాహలమునఁ జేరిపోయిన ట్లగపడుచుండెను. సమరవ్రతులగు క్షత్రియవీరులు రణరంగమును వీడి యవనయుద్ధమును మఱచివచ్చి యీయానందోత్సవమునఁ జేరిపోయిరి. రాజస్థాన రాజపరివార రమణీమణు లెల్లరు వివాహమహోత్సవమునకు వచ్చియుండిరి. మేవారు రాజమహిషి యగునంధతీదేవియు మాతృమందిరమునందున్న నారీమణులను వెంటఁబెట్టుకొని వచ్చి యుండెను. ఈనరనారీమణు లెల్లరిముఖమండలములును సంతోషమును బ్ర

టించుచుండెను. ఒక్క సన్యాసినిమాత్రము—ఒక్కతె మాత్రము—ఈయానందకోలాహలసంపర్కమును విడిచి బహుదూర మేఁగి యొంటికత్తెయై నదీసైకతస్థలమునఁ గూరుచుండి నిశ్శబ్దముగా నేడ్చుచుండెను. కన్నీటిచేఁ దడిసినయామె కావిచీరచెఱఁగు నేలపైఁ బొరలుచుండెను. ముడివీడిన యామె పెన్నెరిగుంపు నిరాదరణముచేఁ జెదరి నదీజలములఁ బడి తేలి యాడుచుండెను. ఆమె నీలోత్పలనయనయుగళమును భేదించుకొని వారిధార ప్రవహించుచుండెను. ఆనవీనసన్యాసిని యెవ్వరో పాఠకులకుఁ జెప్పవలయునా! హా! కృషికసైనికుఁ డీసమయమున రాజాధిరాజకుమారుని వేషముతో వచ్చి యొకసారి అంబరరాజకుమారి మోమ్రోల సాక్షాత్కరింపరాదా!

ఆలయమున కెదుటఁ బుష్పమాలికలచేతను, చిగురుదండలచేతను, ముక్తామణిగణములచేతను వివిధవిధముల నలంకరింపఁబడినతోరణములను గట్టియుండిరి. తోరణమున కొకపార్శ్వమున, సమరసింహునితోవచ్చియున్నపురుషులకును, మఱియొకప్రక్క స్త్రీలకును విడుదుల నేర్పఱచిరి. ప్రదోషకాలమునఁ దోరణపార్శ్వమున స్త్రీలందఱుఁ జేరిరి. వారు హస్తములందుఁ బుష్పబాణములను బుష్పధనుస్సులను ధరించియుండిరి. మఱియొకప్రక్క రాజపురుషులు స్వర్ణకవచములతో రణవేషాలంకృతులై బంగారువిల్లంబులఁ బట్టియుండిరి. వారందఱ

కను ముందు విజయపాలుఁడు—అంబరరాజవంశమునందును వివాహమునకు ముందు మనలోవలెనే యెదురుసన్నాహము హోత్సవము గలదు. వారిలో వరునిపక్షమునఁ బురుషులందఱును, వధువుపక్షమున స్త్రీలందఱు నొకరికొకరు రున్ముఖముగా నొక్కొక్కసైన్యాధిపతినిముందిడికొనియుద్ధసన్నద్ధులవలెనిల్చి యొకరిపైనొకరు హాస్యపుఁబాటలను బాడుకొందురు. పురుషులపక్షమున నల్లగొండ సేనాధిపతిగా నుండెను. స్త్రీలపక్షమున విలాసకుమారి సేనానాయికగా నుండెను. ముందు వధువుపక్షము స్త్రీలు పాడనారంభించిరి.

... ... ... ... ... ...

ఆయనంతకోలాహలమధ్యమున నెవ్వరో యేడ్చుచున్నట్లు వినఁబడియెను. అప్పు డొకయంగన పరుగెత్తికొనివచ్చి "అయ్యో! సర్వనాశన మైపోయినది! వేగముగా రండు—అంబరరాజకుమారి నదిలోఁ బడిపోయినది" అనియెను.

పాట లాఁగిపోయెను. నరనారీసంగ్రామము భంగమయ్యెను. ఆనందకోలాహలము విషాదవిజృంభణముగాఁ బరిణమించెను. స్త్రీపురుషులెల్లరు హాహాకారములతో నదీతీరమునకుఁ బరుగెత్తి పోయిరి. అక్కడ నేడ్చుచున్నయంగనయొక్క తెయంబాలిక జలములంబడినస్థలమును జూపెను. నదీప్రవాహము సుధాకరుని వక్షమున నిడికొని కలకలనినాదముతో నృత్యము సేయుచుండెను—అంబాలిక యానవాలేదియు నగపడలేదు.

---

## అయిదవ ప్రకరణము.

---

నాథద్వారమునకుఁ గోసుదూరమునఁ బూనానదీసైకతస్థలమున లతాగుల్మములచేమఱుఁగువడినిర్జనమైయున్నయొక చిన్నయుపవనమున ఫకీరు చేతనరహితమైయున్నయంబాలిక దేహమును దొడలపై నుంచికొని కూరుచుండియుండెను. ఎదుట విలాసకుమారి మాటాడకుండఁ గన్నీరు నించుచు నిలిచియుండెను.

ఫకీ—ఏడువ వలదు. దైవసంకల్పమునకు సమ్మతింప వలయును.

విలాసకుమారి ముకుళితకరకమలయై కాతరస్వరముతో "గురుదేవా ! నాచిరవాంఛితము దీరునట్లుగా నంబాలిక ప్రాణములను రక్షింపుము." అనియెను.

ఫకీ—వత్సా!నీవు బుద్ధిమతివై యుండియు నిట్టిపని చేయవచ్చునా? అశ్రద్ధ గావించితివో నాకుఁ దెలియలేదు. నీవిది వఱకే రాజకుమారునిసత్యచరిత్రము నంబాలిక కేల తెలుపవైతివి? అట్లు చెప్పియున్నచో నీభయంకరవ్యాపారము నా కన్నులఁ బడకుండును గదా? అమరసింహునిఁ డీమెను వివాహమాడుట నిజముగా నీ కిష్ట మున్నదా? వా రిరువురు దంపతులగుటఁ జూచి నీవానందింపఁగలవా?

విలా—(ఏడ్చుచు) అయ్యో! భగవానుఁడా! ఇంతకా

ల మైనతరువాత మీరు న న్నవిశ్వాసినిగా నెంచుచున్నారుగాఁ బోలును! నిర్భాగ్యురాల నగు నేను, వివాహసమయమునం దం బాలిక యాదరిద్రకృషీకుఁడే రాజకుమారుఁ డని తెలిసికొని తనదుఃఖము లన్నిటిని మఱచిపోవునని యనుకొంటిని. నూతన దంపతు లానందసాగరమున నీఁదుచుండుటఁ జూచి యీ నా జన్మము సార్థకపఱచుకొనవలయునని యెంతయు నాశపడియుం టిని. ఆ నాయాశ ఫలింపదా? అల్పబుద్ధియగు మీబిడ్డయప రాధమును మన్నింప వేఁడికొనుచున్నాను. అంబాలికకుఁ బ్రాణదానమును జేయవలయును. వేగముగాఁ దెలుపవలయు ను. స్వామీ! మీరు వేగముగాఁ దెలుపకుండుటచే నాప్రాణము లు కొట్టుకొనుచుండెను. ఈచిరదుఃఖిని కిహజీవనమునం దొక్కఁడే యాశగలదు—అది ఫలింపదా!

ఫకీ—వత్సా! నీస్నేహితురాలిప్రాణమునకు భయము లేదు—విధాతృనిశుభసంకల్పముచే నుచితసమయముననే మన మిక్కడకు రాఁగల్గితిమి.

విలా—(హర్షప్రఫుల్లవదనముతో) అట్లయిన ననుజ్ఞ నొసఁగుఁడు. నేను వేగముగాఁ బోయి మీవారురాజకుమారున కీ శుభవార్త నెఱింగించెదను.

ఫకీ—వత్సా! కొంచెము తాళుము. నిన్నొకటి యడుగవలసియున్నది—నీభర్త నంబాలిక వివాహమాడినచో నామె నీస్థానము నాక్రమించుకొనును. అందువలన నీకాజీవనమును

భర్తృసౌఖ్యము లేకుండఁబోవును. నీముందుగతి యేమగునో తెలియక నామనస్సు కళవళపడుచున్నది—భగవానుఁడా! అవసానకాలమునకు నాకీదశ సంభవమైనదా? పుత్రికాసమానురాలుగాఁ బెంచినయీబాలిక భావిసౌఖ్యమును నేను నాచేతులతోనే తీసివేయుచుంటినా?

ఫకీరిట్లు చింతాక్రాంతుఁడై దీనోక్తులు పల్కుట విలాసకుమారి యెప్పుడును జూచియుండలేదు. స్వర్గీయానందమయమైన యాముఖమండలమునం దొక్కవిచారరేఖమైన నామె యెన్నఁడును గనియుండలేదు. విలాసకుమారి యాతనికిసాష్టాంగపడి చేతులుజోడించుకొని కరుణస్వరముతో "స్వామీ! మీరంతర్యాములు. నాహృదయముమీ రెఱుంగనిది గాదు. కుమారామరసింహుఁడు నాస్వామియే. నాయిహజీవితమున కిష్టదేవత. నాపరలోకసాధనమునకును నాతఁడే యధీశ్వరుఁడు. నాయీయల్పప్రాణము నాకాతనిప్రాణముకంటెను బ్రియమైనదా? గురుదేవా! మీ రెఱుంగరు—అతనికాలిలో నొకచిన్నముల్లు గ్రుచ్చుకొనినను నేను నారక్తమంతయు ధారవోసి దానిని దీసివైచెదను. నాకంతకంటె సుఖమేదియులేదు. ఆశీర్వదింపుఁడు—నాహృదయేశ్వరుఁడు తాను వరించినయాంబాలికను బెండ్లియగుటచూచి నేను నారీసుఖపరాకాష్ఠను బొందెదను" అనియెను.

---

## ౨౫వ ప్రకరణము.

నదీతీరమునందున్న యాచిన్నయుపవనము ప్రాతస్సూర్యకిరణస్పర్శచే నవ్వుచుండెను. నదీప్రవాహకలకలశబ్దము శకుంతసంతతులమనోహరకలనాదములతోఁ జేరి, సుధామయగానముగాఁబరిణమించి, ప్రూనా, నదీసైకతములఁబ్రతిధ్వనించుచుండెను. నిదాఘప్రభాతసమయమున మెల్లమెల్లఁగావీచుచున్న మలయమారుతము మెల్లమెల్లఁగాశీతలజలములనీఁది, మెల్లమెల్లగాఁ గుసుమవల్లరుల నాలింగనముచేసికొని, తనమృదుదేహమునుసరససౌరభములచేనిండించుకొని, మెల్లమెల్లఁగా శకుంతసంతానములనుమనోహరకాకలీస్వరామృతమును సేకరించుకొని మెల్లమెల్లఁగాఁ బరుండియున్నయంబాలికయలకదామములతో నాడుకొనుచుండెను. అంబాలిక యప్పటికిని నిర్జనమైయున్నయాయుపవనమున నేలపైఁబరుండియుండెను. ఆనిద్రలో నామె యొకస్వప్నమును గాంచెను. తాను శోకతాపమయమగునీమర్త్యలోకమును వీడి సురలోకమునకుఁ బోయినట్లును, పక్షులయవ్యక్తమధురగానములచేతను, అప్సరలయమృతసంగీతములచేతను, వజ్రపుష్పశోభితము లగుముక్తాలతలచేతను విలసిల్లుచున్నసురలోకమునందు దివ్యతేజోవిరాజితు లగుదేవతలనడుమ ఫకీరు దివ్యరూపము ధరించి దేవసభ నలంకరించినట్లును, ఫకీరు తన్నుఁజూచి "వత్సా! ఇక్కడదుఃఖము లేదు; వైష

మ్యము లేదు; వర్ణ భేదము లేదు; అధికులు నల్పులు నను భేద ము లేదు; ధనికులు దరిద్రులు నను భేదము లేదు; రాజులు రైతులు ననుభేదము లేదు; అందఱు సమానులే యని చెప్పి నట్లును, అందులకుఁ దాను నిట్టూర్పు విడిచి "అల్లైనచోఁ బాపమయ మగుభూలోకమును విడిచి కృషికుఁ డీశాంతినికే తనమున కేల రాఁగూడ"దని యోజించుకొనుచున్నట్లును, దనమనోభావమును ఫకీరు తెలిసికొని చిఱునవ్వునవ్వి! "వత్సా! చూడుము, పాపమయ మగునరలోకమును వీడి కృషికుఁడీయా నందధామమునకు వచ్చియున్నాఁడని" చెప్పినట్లును, కృషికుఁ డప్పుడే యమర వేషమును దాల్చి తన మొదుట సాక్షాత్కరించి నట్లును, అభిమానాశ్చర్యవిసాదములతోఁ గృషీకకుమారునిఁ జూచి తిరస్కారపూర్వకముగా "నిదివఱకు నన్నీయానందధా మమున కేల తోడ్కొనిరాలేదు" అని యడిగినట్లును, అందు లకాతఁడు—"రాజకుమారీ! క్షమింపుము! ఇఁకఁ బ్రాణము లుండువఱకును నిన్నువిడిచి యుండఁబోను" అని చెప్పినట్లును గలగాంచెను.

అంతలో నంబాలికకు మెలఁకువ వచ్చెను. ఆ మెచ్చూ ర్ఛనుండి తేఱికొని కను విచ్చి చూచెను. నిజముగాఁ గృషిక యువకుఁడు రాజాధిరాజ వేషముతోఁ గాళ్ళకడఁ గూరుచుండి యుండెను. ఆతఁడు "రాజనందినీ! క్షమింపుము. ఇఁకనిన్నెప్ప టికిని విడువఁబోను" అనియెను.

అంబాలిక యొకసారి కన్నులు మూసికొని మరలఁ గన్నులు తెఱచి, ప్రేమామృతమయమగు నాముఖచంద్ర మండలమును నిశ్చేష్టయై చూచుచుండెను. కృషికుఁడు రాజకుమారిచరణ కమలములంటి "క్షమింపుము రాజకుమారీ!" అనియెను.

రాజ—(మెల్లమెల్లఁగా) ఇక్కడకు నీవెచ్చటినుండి వచ్చితివి? నీకీరాజవేష మెందులకు? ఎవ్వరిని క్షమింపుమని వేఁడుచున్నావు? నీవు నాకేమి యపచారము గావించితివి? నీమాట లెవ్వియు నాకుఁ దెలియుటలేదు.

కృషి—అంబాలికా! నీకింతవఱకును దెలుపలేదు. నేను మీవారురాజకుమారుఁడనగునమరసింహుఁడను.

రాజకుమారి యించుకసేపు మౌనముతో నమరసింహుని దేఱిపాఱఁజూచి "ఐనచో నీవిదివఱకును—"

ఇఁక మాటాడలేకపోయెను. ఆమెకంఠము రుద్ధమయ్యెను. కన్నులనుండి యశ్రుధార లురులుచుండెను. అమరసింహుఁ డంబాలిక కాళులపై నొకచేయి నుంచి రెండవచేతి నామెడమెకుఁజుట్టి యామె బాష్పపూరితనయనద్వయమును ముద్దిడుకొనియెను. ఆకస్మికముగా నామెకు శక్తిగలిగి యమరసింహునిబాహువులనుండి తప్పించుకొని లేచి నిలువఁబడియెను. తెల్లనైనయామెముఖమండల మంతలో నారక్తమయమయ్యెను. కన్నుల నీరు నిండెను. ఎదవు లదరఁజొచ్చెను. అభి

మానరోషములతో నకుప్రియమన్మై "ఇన్నినాళ్లు నన్నింతకష్ట పెట్టుట యెందులకు?" అనియెను.

అమ—రాజనందినీ! నీవు నా వెనుకటివృత్తాంతమును విన్నచో నన్ను క్షమింపఁగలవు. తల్లిగారియాజ్ఞాప్రకారము నేనిదివఱకునుగృషీక వేషముతో గిరిదుర్గమున నజ్ఞాతవాసము చేయుచుంటిని.

ఉపవనమునకుఁ బార్శ్వమునం దున్నకదంబవృక్షము నకు వెనుకనుండి "సఖి, హే, కేశీమథనముదారం" అనిపాడుచు విలాసకుమారి నవ్వుచు వచ్చి నూతనదంపతుల కెదురుగానిలిచెను. అమరసింహుఁ డంబాలిక కాళ్ళువదలి లేచి నిలుచుండెను. అంబాలిక చకితయై మేలిముసుఁగుకొంగుతోఁ గన్నులు తుడుచుకొనియెను. విలాసకుమారి చప్పటులు చఱచుచు "ప్రథమసమాగమలజ్జితయాపటుచాటుశతైరనుకూలం మృదుమధురభాషితయా—"అనిపాడఁ దొడంగెను.

అంబాలిక పరుగెత్తికొని వచ్చి విలాసకుమారినోరు తనరెండుచేతులతో మూసి పాడకుండఁ జేసి "ఛీ, సఖీ! నీవు సిగ్గుమాలిన శిఖండివి" అనియెను.

విలాసకుమారిక యంబాలికచేతులను విడిపించుకొని కనుమలపి చూచి కల్పితరోషముతో నమరసింహు నుద్దేశించి "అంబరరాజకుమారి నంటుట కీదరిద్రకృషికకుమారున కింతటిధైర్య మెట్లువచ్చినది?" అనియెను.

అమరసింహుఁడుం బాలికబాహులతలను దనకంఠము నకుఁ జుట్టికొని "ఇఁకముందు నేను దరిద్రకృషికకుమారుఁడ నుగాను. "దేవీ! ఇదిగోఁజూడుము! నేఁడు నాకంఠమును సర్వ శ్రేష్ఠము నమూల్యమునగు "కోహినూరురత్న" మలంకరించిన ది!" అనియెను.

## ఉపసంహారము

ఫకీరు దుర్గాదాసునకుఁ జెప్పినదంతయుఁ గార్యరూప మునఁ బరిణమించెను. స్వల్పకాలమునందే యాతఁ డజితసిం హుని యోధపురసింహాసనమునఁ గూరుచుండఁబెట్టి యవన యుద్ధమునుండి విశ్రాంతి నొందెను. మీవారుమహారాణా విశే షాదరభావముతో రాఠోరుసేనాపతిని దనరాజధానికిఁ గొం పోయెను. దుర్గాదాసు బ్రతికి యున్నంతకాలము మీవారు రాజధానియందు బహుసుఖముగాఁ గాలము గడపుచుండె ననియు, నమరసింహుఁడు సింహాసనమునకు వచ్చినపిమ్మట దుర్గాదాసుని దినవెచ్చమునకు దినమున కేనూఱురూప్యములు రాజకోశాగారమునుండి యిప్పించుచుండె ననియుఁ, జరిత్రము చదివినవారికిఁ దెలిసియుండవచ్చును. స్వల్పకాలమునందే మాతృమందిరము ప్రశస్తరనిర్మితస్తూపముగాఁ బరిణమించెను.

అమరసింహునకు వివాహమైనతరువాత విజయపాలుఁడు తానుగూడ వివాహము గావించుకొనుటకు సంకల్పించుకొ



**మనసు ఫౌండేషన్**

**పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPWA1023/162 |
| పుస్తకం పేరు | గుణవిజయము |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | Yes |
| వెనక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 183 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | i, Bci |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Triveni |
| పేజీలు విడదీసినది | Triveni |
| స్కాన్ చేసినది | Pro(yusL) |
| పరీక్ష చేసినది | KASIMBI |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యబడి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |